రెండు సంవత్సరాలుగా మిమ్మల్ని
అలరించిన పౌరాణికగాథ

## విఘ్నేశ్వరుడు

ఈ సంచికతో పూర్తవుతోంది.



వచ్చే సంచిక నుంచి రసవత్తరమైన
కథనంతో, మనోహరమైన
చిత్రాలతో అందరినీ మైమరపించే
పురాణం సీరియల్

# విష్ణు కథ

ప్రారంభం!

మీ కాపీని (జనవరి 2004)
ఈ రోజే రిజర్వ్ చేసుకోండి!



చందమామ

సంపుటి 109 డిసెంబర్ 2003 సంచిక:6

## ఈ నెల విశేషాలు



దేవయ్య విద్యలు

8



భల్లూక మాంత్రికుడు -2

13



శంతనుడి నిర్ణయం (బే.క)

19



రక్తసంబంధం

51



## ఈ సంచికలో ...



SUBSCRIPTION

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**

***Remittances in favour of***
***Chandmama India Ltd.***
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ.**120**లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్టు ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# క్రీడారంగం - సర్వతోముఖాభివృద్ధి

భారతదేశం 1951లో తొలి ఆసియా క్రీడలను నిర్వహించింది. ఎనిమిదవ ఆసియాడ్ క్రీడలు కూడా మనదేశంలోనే 1982లో జరిగాయి. హైదరాబాద్ నగరంలో తొలి ఆఫ్రో-ఏషియన్ క్రీడలు ఇటీవలే ఘనంగా జరిగి ముగిశాయి. 'రెండు ఖండాలు - ఒకే స్ఫూర్తి' అన్న నినాదంతో ఉభయ ఖండాల దేశాలు క్రీడలలో సమధికోత్సాహంతో పాల్గొన్నాయి. క్రీడలు విజయవంతంగా జరగడానికి బాధ్యులైన నిర్వాహక వర్గానికీ, రాష్ట్రప్రభుత్వానికీ అభినందనలు తెలియజేస్తున్నాం. ఈ క్రీడలలో స్వర్ణపతకాలు సాధించడంలో ద్వితీయ స్థానంలోనూ, మొత్తం పతకాల సంఖ్యలో ప్రథమ స్థానంలోనూ మన దేశం నిలిచింది. ఇలాంటి అంతర్జాతీయ క్రీడలలో భారత క్రీడాకారులు సాధించే విజయాలు మన ప్రజలకు, ముఖ్యంగా యువతకు ఉత్సాహం కలిగించి, వాళ్ళు క్రీడల పట్ల మరింత ఆసక్తి కనబరచడానికి స్ఫూర్తినిస్తాయి. క్రీడలను, క్రీడాకారులను ప్రోత్సహించడానికి ప్రభుత్వాలు పెద్ద మొత్తాలలో నిధులను కేటాయించడానికి దోహదం చేస్తాయి. బహుళజాతి సంస్థలు క్రీడోత్సవాలను, క్రీడాకారులను స్పాన్సర్ చేయడం ద్వారా - తమ ఉత్పత్తులను, సేవలను ప్రచారం చేసుకోవటానికి సులభమైన రాజమార్గం కనుగొన్నాయి.

ఈ ధోరణులు క్రీడాభిమానులకు ఆనందం కలిగించేవే అయినా, వీటి పర్యవసానాలను కూడా పరిగణనలోకి తీసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. భారీ వ్యాపార సంస్థలు నిర్దిష్టమైన కొన్ని క్రీడలను మాత్రమే ఎంపిక చేస్తాయి. అంటే తమ ప్రయోజనాలకు అనుకూలంగా ఉన్న; ప్రాచుర్యం గల క్రీడల వైపే మొగ్గు చూపి, మిగతా వాటిని పట్టించుకోవు. ఆ కారణంగా క్రీడారంగం సర్వతోముఖాభివృద్ధి కుంటుపడుతుంది.

వ్యక్తుల ఆరోగ్యానికీ, జాతి పురోగతికీ క్రీడలు చాలా ఉపయోగపడతాయి. మన దేశంలో అత్యధికులైన క్రీడాకారులకు అత్యధికమైన ప్రయోజనం సమకూరే విధంగా ఆర్థిక వనరులను జాగ్రత్తగా సద్వినియోగం చేసుకోవాలి. అప్పుడే అంతగా ప్రాచుర్యం లేని క్రీడల పట్ల ఆసక్తి కలిగిన వారు సైతం ఒలింపిక్ (2004వ) సంవత్సరంలో అడుగు పెడుతూ తమ సత్తాను నిరూపించగల అవకాశం ఉంటుంది!

సంపాదకుడు : విశ్వం





# ఛత్వారం

పూర్వం ఒకప్పుడు హత్యలూ, దారిదోపిడీలూకాక, చిన్నచిన్న దొంగతనాలు చేసినవాళ్ళను, గ్రామాధికారులు, మెడలో ఒక కొయ్య గుదిబండ కట్టి ఎండలో కూర్చోబెట్టేవారు.

ఒకసారి ఎల్లయ్య అనేవాడు, గ్రామం బయట పొలిమేరలో మేస్తున్న ఎద్దునొకదాన్ని దగ్గర్లో దొరికినతాడును మెడకు కట్టి, దొంగిలించుకుపోవాలని చూశాడు. ఐతే, ఆ ప్రాంతాల కాపలా వున్నవాడొకడు అది చూసి, గ్రామాధికారికి చెప్పాడు. గ్రామాధికారి, నౌకర్లను పంపి ఎల్లయ్యను పట్టుకుని-సూర్యాస్తమయవేళ వరకూ శిక్షగా, మెడలో ఒక గుదిబండ తగిలించి, ఎర్రని ఎండలో కూర్చోబెట్టించాడు.

కొంతసేపు తర్వాత, ఎల్లయ్యఊరివాడు పుల్లయ్య అటుగాపోతూ, ఎల్లయ్యను చూసి ఆశ్చర్యంగా, ''ఏమిటిది, మెడలో గుదిబండా నువ్వా?'' అంటూ అడిగాడు.

''ఏం చెప్పేది, అంతా దురదృష్టం!'' అన్నాడు ఎల్లయ్య.

''అసలేం జరిగిందేమిటి?'' అన్నాడు పుల్లయ్య తమ ఊరివాడి పరిస్థితికి జాలిపడుతూ.

''మరేం లేదు. అలా గ్రామం దాటిపోతూంటే, ఒక పచ్చికబయల్లో పెద్ద తాడొకటి కంటబడింది, తీసుకున్నాను, అంతే!'' అన్నాడు ఎల్లయ్య.

''దారిలో కనబడిన తాడు తీసుకున్నందుకు ఇంత శిక్షా?'' అంటూ నివ్వెరపోయాడు పుల్లయ్య.

''ఆ తాడు వెనక ఎంత లేదన్నా ఐదారు వందలు చేసే ఎద్దొకటున్నది. నా ఛత్వారం పాడుగానూ, దాన్ని నేను గమనించలేదు!'' అన్నాడు ఉస్సూరుమంటూ ఎల్లయ్య.





# దేవయ్య విద్యలు

శివగంగాపురం గ్రామస్థుడు దేవయ్య రైతు కుటుంబంలో పుట్టాడు. పొలం పనులు చేస్తూనే, వాడు పండితుల సాయంతో శాస్త్రాలు చదివాడు. కవిత్వం చెప్పడం, పాటలు పాడడం, బొమ్మలు గీయడం లాంటి విద్యల్లో కూడా అంతో ఇంతో ప్రవేశం కూడా సంపాదించాడు. తండ్రి ధర్మయ్య, వాణ్ణి, "ఏదో ఒక దానిమీద దృష్టి పెట్టరా! అన్నీ నేర్చినా ఎందులోనూ ప్రావీణ్యం లేకపోతే, ముందు ముందు బ్రతుకుతెరువు కష్టమవుతుంది," అని తరచుగా హెచ్చరిస్తుండేవాడు.

కానీ, దేవయ్య ఆ మాటలు చెవికెక్కనీయకుండా, "రోజులు మారాయి, నాన్నా! ఇప్పుడు సుఖంగా బ్రతకాలంటే, పూర్వంలా ఏ ఒక్క విద్యో తెలిస్తే సరిపోదు. నేనింకా చాలా చాలా విద్యలు నేర్చుకుంటాను," అనేవాడు.

ధర్మయ్యకు పదెకరాల పొలముంది. ఒకప్పుడాయనకు రెండెకరాలే వుండేవి. వ్యవసాయం మీదే దృష్టి పెట్టి ఎంతో కృషి చేసి, ఆయన బాగా సంపాదించాడు. తండ్రి చేసిన అప్పులు తీర్చడంతో పాటు కష్టాల్లో వున్న అన్నను ఆదుకున్నాడు. ఇద్దరు చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు చేశాడు. ఈ మధ్యనే ఘనంగా కూతురి పెళ్ళి కూడా చేశాడు. ఇన్నీ చేసిన ఆయనకు కొడుకు దేవయ్య గురించి నిత్యం దిగులుగా ఉంటుంది. ఎందుకంటే - దేవయ్యకు ఉన్న గ్రామంలోకాక పట్నంలో స్థిరపడాలని ఉన్నది. అవతలివాడు నోరు విప్పేలోగా, తన గురించిన గొప్పలు చెప్పుకోవడమే వాడికి అలవాటు.

"నీ గురించి నీవు చెప్పుకోవటం కాదురా, ముందు ఎదుటివాళ్ళ గురించి తెలుసుకుని, వాళ్ళలో పనికొచ్చేదేదైనా ఉంటే నేర్చుకోవాలి. లేకుంటే నీ పని ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లు ఉంటుంది!" అంటూ ధర్మయ్య, కొడుకును చాలాసార్లు హెచ్చరించాడు కానీ ప్రయోజనం లేకపోయింది.

ఇలా వుండగా, ఒక రోజున దేవయ్య మేనమామ సీతయ్య వాళ్ళింటికి వచ్చాడు.

శ్రీరామకమల్

ఈడొచ్చిన తన కూతురు రాధకు, దేవయ్యే చక్కనిజోడని పదేపదేచెప్పాడు. ధర్మయ్యకా పెళ్ళిసంబంధం ఇష్టమేగానీ దేవయ్య మాత్రం, "నాకు చాలా విద్యలు వచ్చు. నాకొచ్చినవాటిలో సగమైనా విద్యలు తెలిసిన అమ్మాయినే, నేను పెళ్ళి చేసుకుంటాను. రాధ నన్ను పెళ్ళి చేసుకోవాలంటే, ముందుగా రకరకాల విద్యలు నేర్చుకోవాలి!" అన్నాడు.

"నీకు ఏంవిద్యలు వచ్చో కానీ, నీ పేరు ప్రఖ్యాతులు వేరే ఎక్కడా వినలేదు. నీ విద్యల వల్ల ప్రయోజనం ఏమిటో నాకు తెలియదు. వాటిని ఉపయోగించి ఏ రాజు కొలువులోనో ఉద్యోగం సంపాదించు. అప్పుడు, రాధ కూడా నువ్వు చెప్పిన విద్యలు నేర్చుకుంటుంది," అన్నాడు సీతయ్య.

అది సవాలుగా తీసుకుని, దేవయ్య వెంటనే రాజధానికి ప్రయాణం కట్టాడు. అక్కడికి చేరుకున్నాక, ఒక ధర్మసత్రంలో బస చేశాడు. అక్కడ గుబురు మీసాలున్న నడివయస్కుడొకడు వాడికి పరిచయమ య్యాడు. దేవయ్య అతడికి తనను గురించిన గొప్పలన్నీ చెప్పుకుని, "రాజు కొలువులో ఉద్యోగం సంపాదించాలని వచ్చాను. వెంటనే ఉద్యోగం దొరుకుతుందని నాకు నమ్మకమే! అయితే, జీతమెంత అడగాలో తేల్చుకో లేకుండా ఉన్నాను," అన్నాడు.

నడి వయస్కుడు కాసేపాలోచించి, "నువ్వు చెప్పినదానిని బట్టి నీకు చాలా విద్యలు తెలుసు. కానీ, రాజు కొలువులో వాటికి కాళీలున్నట్టు లేదు. నీకు కత్తి యుద్ధం గనక వస్తే, రాజు కొలువులో అవ కాశముండొచ్చు!" అన్నాడు.



"కత్తి యుద్ధమా? అందులో నాకు కొంత ప్రవేశముంది. ఎటొచ్చీ దానికి కాస్త మెరుగులు దిద్దుకోవాలి. ఇక్కడ సరైన గురువు దొరుకుతాడా?" అని అడిగాడు దేవయ్య.

"ఇక్కడ వీరవరుడనే గురువు వున్నాడు. ఖడ్గవిద్యలో ఆయన్ను మించినవారు వుండరంటారు. సమర్థులకు ఆయన ఉచి తంగా విద్య నేర్పుతాడు," అన్నాడు నడి వయస్కుడు.

దేవయ్య మర్నాడు వాకబుచేసి వీరవరు డిల్లు తెలుసుకుని, తను వచ్చినపని చెప్పాడు.

ఆయన అతణ్ణి పరీక్షించి, "నీలో చురుకుదనముంది. దృష్టి పెట్టావంటే, వారం రోజుల్లోనే ఖడ్గ విద్యలో మంచి ప్రావీణ్యం సంపాదించగలవు," అంటూ వాడిని శిష్యుడిగా చేర్చుకున్నాడు.



వారంరోజుల్లోనే దేవయ్య, గురువు మెప్పుపొందేంతగా ఖడ్గవిద్యలో మెలకువలు ప్రదర్శించగలిగాడు.

వారం రోజుల తర్వాత దేవయ్యకు సత్రంలో మళ్ళీ నడివయస్కుడు కనిపించాడు. ఆయనతో దేవయ్య మర్నాడే తను రాజు కొలువులో చేరబోతున్నట్టు చెప్పాడు.

అందుకు నడివయస్కుడు, ''అయ్యో! నిన్న ఒక యువకుడు తన ఖడ్గవిద్యాసామర్థ్యాన్ని ప్రదర్శించి రాజు కొలువులో చేరిపోయాడు. అయితే, రాజుగారి కోశాగారంలో ఆదాయ వ్యయాల లెక్కలు వేయడానికి, ఒకరు కావాలట; ప్రయత్నించి చూడు! ఎటొచ్చీ కోశాగారపు లెక్కలు విభిన్నంగా వుంటాయి. ముందుగా ప్రముఖ గణితజ్ఞుడు భాస్కరయ్యను కలుసుకుంటే, ఆయన నీకు కొన్ని సులువైన మార్గాలు నేర్పవచ్చు,'' అన్నాడు.

దేవయ్య మర్నాడు భాస్కరయ్యను కలుసుకుని ఆయన్ను మెప్పించి, వారం రోజుల్లో కోశాగారపు లెక్కల విభిన్న పద్ధతులన్నీ బాగా తెలుసుకున్నాడు. అయితే, అప్పటికి మూడు రోజుల ముందే కోశాగారపు ఖాళీ కూడా భర్తీ అయిన విషయం, ఆ తర్వాతనే వాడికి తెలిసింది. అప్పటికీ దేవయ్య నిరుత్సాహపడక, రాజు కొలువులో తనకు ఇంకేదైనా అవకాశముందేమో చెప్పమని నడివయస్కుణ్ణి అడిగాడు.

''ఈ విధంగా వారానికొక కొత్త విద్యలో ప్రావీణ్యాన్ని సంపాదించటానికి కృషి చేయడంలో నీకు శ్రమ అనిపించడంలేదా?'' అని అడిగాడు నడివయస్కుడు.

''నాకు విద్యాదాహం ఎక్కువ. విద్యాభ్యాసానికి చేసే కృషి, నాకు శ్రమ అనిపించదు,'' అన్నాడు దేవయ్య గర్వంగా.

''అయినప్పటికీ నీవు, నీ మేనమామను సవాలు చేసి నెలరోజులు గడచిపోయాయి. ఇంత వరకూ రాజు కొలువులో ఉద్యోగం సంపాదించలేకపోయావు. కాబట్టి నీవిక శివగంగాపురం వెళ్ళిపో. నీ మేనమామతో ఓటమిని అంగీకరించు. రాధను పెళ్ళి చేసుకుని, నీ తండ్రికి వ్యవసాయంలో సాయపడు,'' అన్నాడు నడివయస్కుడు.

ఇందుకు దేవయ్య అయిష్టంగా, ''నా మేనమామతో చేసిన సవాలులో నేను ఓడిపోయి ఉండవచ్చు. కానీ, నేను నేర్చిన విద్యలవల్ల ఏ ప్రయోజనమూ లేదన్న, ఆయన మాటను నిజం కానివ్వను. ఎప్పటికో ఒకప్పటికి రాజు కొలువులో ఉద్యోగం సంపాదిస్తాను,'' అన్నాడు.

"రాజు కొలువులో ఉద్యోగం సంపాదించడానికే అయితే, నీ విద్యలు పూర్తిగా నిష్ప్రయోజనం," అన్నాడు నడివయస్కుడు నమ్మకంగా.

"అయితే, నేనిప్పుడు నీతోనే సవాలు చేస్తున్నాను. రాజు కొలువులో ఉద్యోగం సంపాదిస్తే, నువ్వు నాకేమిస్తావు?" అన్నాడు దేవయ్య.

"నువ్వు రాజు కొలువు విషయంలో, నాతో సవాలు చేసి నెగ్గలేవు!" అన్నాడు నడివయస్కుడు దృఢంగా.

"అంత నమ్మకంగా ఎలా చెప్పగలవు?" అన్నాడు దేవయ్య చిరాగ్గా.

"నేనే రాజును కాబట్టి, చెప్పగలను!" అన్నాడు నడివయస్కుడు.

దానితో, ఆ నడివయస్కుడు మారు వేషంలో వున్న మహారాజని, దేవయ్యకు అర్థమైంది. వాడు ముందు తెల్లబోయినా, తొందరగానే తేరుకుని, ఆయనకు పాదాలంటి నమస్కరించాడు.

రాజు, వాడిని ఆప్యాయంగా లేవనెత్తి, "పాదాలంటి నమస్కరిస్తే, నన్ను గౌరవించినట్లు కాదు. నీవు నన్ను నిజంగా గౌరవిస్తే, నీ గ్రామానికి తిరిగి వెళ్ళి నేను చెప్పినట్లు చెయ్యి," అన్నాడు.

"ప్రభూ! తమరు నన్ను అన్ని విధాలా పరీక్షించారు. మరి నాకు మీ కొలువులో ఉద్యోగం ఇవ్వడానికి అభ్యంతరమేమిటి?" అన్నాడు దేవయ్య దీనంగా.

ఆ ప్రశ్నకు రాజు చిరునవ్వు నవ్వి, "నీలో మిడిసిపాటు ఎక్కువ. అది నేను నిన్ను కలిసిన మొదటి రోజునే గ్రహించాను. నీకు అన్ని విద్యలూ వచ్చుననుకుంటావే తప్ప, ఏ విద్యలోనూ పరిపూర్ణతలేదని



గ్రహించవు. రాజు కొలువులో చేరడానికి నీకు తెలిసినది చాలదని ప్రతిసారీ స్పష్టమవుతున్నా నీవు దాన్ని గురించి ఏమాత్రం ఆలోచించినట్టు లేదు," అన్నాడు.

దేవయ్య దీనికి కొద్దిగా చిన్నబుచ్చుకుని, "ప్రభూ! కానీ, ఏ విద్యలోనైనా నేను అతి త్వరగా ప్రావీణ్యం సంపాదించగలిగానని, తమరే ఒప్పుకున్నారు గదా!" అన్నాడు.

"ప్రావీణ్యమంటే ఎంత? రాజు కొలువులో ఉద్యోగం సంపాదించటానికి తగినంత. అంతే కానీ ఏ విద్యా అంతకు మించి నిన్నాకర్షించలేదు. నీ వంటి వాడి విద్యలు నిష్ప్రయోజనం!" అన్నాడు రాజు.

దేవయ్య ఆ మాటలకు మరింత చిన్నబుచ్చుకుని, "ఇప్పుడు నాకు నాలోని లోపం తెలిసింది. నేను తమరు చెప్పిన విద్య మీదే దృష్టి పెట్టి శ్రద్ధ వహిస్తాను. నాకు

తమరి కొలువులో ఉద్యోగం ఇప్పించండి,'' అంటూ రాజును ప్రాధేయపడ్డాడు.

''ఇదే విధంగా ఆరంభంలోనే నువ్వు ఆలోచించి ఉంటే, నా కొలువులో తప్పక ఉద్యోగం ఇప్పించి ఉండేవాణ్ణి. విద్యల్లో ప్రావీణ్యం సంపాదించడంలో జరిగిన ఆలస్యమే, నన్ను ఈ కోరిక కోరడంలో చేశావు. అంతా నీ దురదృష్టం!'' అన్నాడు రాజు.

''కానీ, తమరిని కోరడం విషయంలో, నేను ఆలస్యం చేశాననుకోను.తమరు ఈ దేశాన్నేలే ప్రభువులు! తమరు మహారాజని తెలిసిన వెంటనే, ఈ కోరిక కోరాను,'' అన్నాడు దేవయ్య.

రాజు నవ్వి, ''మనం నెల రోజుల క్రితమే కలుసుకున్నాం. నేను నీకు రాజు కొలువులో వుండే ఉద్యోగావకాశాల గురించి ఎప్పటి కప్పుడు చెబుతూ వచ్చాను. నేనెవరో, నాకివన్నీ ఎలా తెలుస్తున్నాయోనన్న ఆలోచన నీకు రాలేదు. నా గురించి తెలుసుకోవాలన్న కుతూహలమే నీలో రేగలేదు. కారణం నీకు నీ గురించే తప్ప ఎదుటివారి గురించిన ఆలోచన లేదు. ఎంతసేపూ నీ గురించే చెప్పుకోవాలన్న తపన విడిచి, నేనెవరై ఉంటానా అని ఒక్కక్షణం ఆలోచించి ఉంటే, నీవు నన్ను గుర్తించటానికి ఆలస్యం జరిగేది కాదు. ఎదుటి మనిషిని గుర్తించి అంచనా కట్టడం ఇంత ఆలస్యం చేసినవాడికి, రాజు కొలువులో స్థానముండదు. ఇప్పటికీ నేను చెబితేనే, నా గురించి తెలిసింది తప్ప, నీకు నీవుగా నన్ను తెలుసుకోలేకపోయావు,'' అన్నాడు.

ఈ మాటలు విని దేవయ్య సిగ్గుతో తల వంచుకున్నాడు. వాడు, రాజు చెప్పినట్టే శివ గంగాపురం తిరిగి వెళ్ళి, తండ్రి వద్ద వ్యవసాయం పనులు శ్రద్ధగా నేర్చుకుంటూ, ఆయనకు ఎంతో సంతోషం కలిగించాడు. తర్వాత రాధను పెళ్ళి చేసుకుని కలకాలం సుఖంగా జీవించాడు. తాను నేర్చిన విద్యలను, ఆ గ్రామంలోని ఆసక్తి గల యువకులకు నేర్పుతూ వాటిలోని మెలకువలను తెలియజేసేవాడు. ఆ యువకులు ఎంతో ఆనందంగా, ''నువ్వు రాజు కొలువుకు అంకితమైతే, మాకీ అవకాశముండేది కాదు,'' అని మెచ్చుకునేవారు.

తన విద్యలు పూర్తిగా నిష్ప్రయోజనం కాదని తెలియడంతో, దేవయ్యకూ ఎంతో సంతోషంగా ఉండేది. అయితే, వాడు తన విద్యల గురించి గొప్పలు చెప్పుకునే అలవాటు మాత్రం పూర్తిగా మానుకున్నాడు.





# భల్లూక మాంత్రికుడు

## 2

*[కాళీవర్మ అనే క్షత్రియ యువకుడు, ఉద్యోగం కోసం రాజధానీనగరానికి పోతూండగా, దారిలో అతడికి బందిపోటు దొంగలను గురించి గ్రామస్థులు చెప్పారు. కాళీవర్మ గ్రామ యువకుల సాయంతో బందిపోట్లను వేటాడాడు. తరవాత అతడు నగరాన్ని సమీపిస్తూండగా, జితకేతు రాజుగారి ఆశ్వికభటులు, అతణ్ణి హఠాత్తుగా చుట్టుముట్టి పట్టుకున్నారు. తరవాత –]*

చంద్రశిలా నగర అశ్వసైనికులు, కాళీవర్మతో నగరం ప్రవేశించారు. అంత మంది సైనికులు, ఒక్కగానొక్కణ్ణి గుర్రం మీద బంధించి తీసుకుపోతూండటం చూసి, రాజవీధివెంట నడిచే ప్రజలు చాలా ఆశ్చర్యం చెందారు. వాళ్ళల్లో కొందరు, ఆ గుర్రం మీద కట్టబడివున్న బంధితుడెవడని అడిగినప్పుడు ఆశ్వికుల నాయకుడు ఎంతో విజయగర్వంతో, ''ఈ బంధితుడా? ఇతడి పేరు కాళీవర్మ! మన రాజ్యానికేగాక, దుర్ముఖ రాజుగారి ఉదయగిరి రాజ్యానికి కూడా ప్రబల శత్రువు. అరణ్యంలో ఇతణ్ణి పట్టుకునేందుకు మేం పడ్డ శ్రమ అంతా ఇంతా కాదు,'' అని చెప్పసాగాడు.

చంద్రశిలా ఉదయగిరి రాజ్యాలు రెంటికీ విరోధి అయిన ఈ కాళీవర్మ కథ ఏమిటో విందామని కొంతమంది జనం అశ్వికుల వెనకగా రాజప్రాసాదం కేసి నడిచారు. ఆశ్వికుల నాయకుడు రాజప్రాసాదం ముందున్న ఆవరణలో తన తోటి ఆశ్వికులను వుండమని చెప్పి, రాజ భవనంలోకి పోయి, ఒక భటుడి ద్వారా



జితకేతు రాజుకు, తాను కాళీవర్మను బంధించిన తెచ్చినట్టు కబురు చేశాడు.

ఆ సమయంలో రాజు జితకేతుడు, ప్రధానమంత్రితో పొరుగురాజు దండెత్తి వస్తానంటూ దూత ద్వారా పంపిన లేఖ గురించి మంతనాలాడుతున్నాడు. కాళీ వర్మ దొరికినట్టు వింటూనే ఆయన పర మానందపడిపోతూ, మంత్రితో, ''మహా మంత్రీ! ఈ కాళీవర్మ అనే క్షత్రియ యువ కుడి కారణంగా మనం, రాజు దుర్ముఖు డితో యుద్ధం చేయవలసిన ప్రమాదం ముంచుకొచ్చిందనుకున్నాను. వాడు దొరి కాడు; ప్రమాదం తొలగిపోయింది. వాణ్ణి ప్రాణాలతో దుర్ముఖుడి వద్దకు పంపుదా మంటారా, లేక ఉరితీయించి, శవాన్ని పంపటం బావుంటుందంటారా?'' అన్నాడు.

''మహారాజా, రాజు దుర్ముఖుడి లేఖలో వున్నదాన్ని బట్టి, ఆయనకు మీరు చెప్పిన రెండు పద్ధతుల్లో ఏదైనా సమ్మతమే. కాని, ఆ దొరికినవాడు, బందిపోట్లను మన రాజ్య సరిహద్దుల నుంచి ఉదయగిరి రాజ్యం లోకి పారదోలిన కాళీవర్మే అన్న రుజువు కావాలిగదా? అలాలేనప్పుడు మనం మాట తప్పినవాళ్ళమై, రాజు దుర్ముఖుడి వల్ల కొత్త చిక్కులు కొనితెచ్చుకున్నవాళ్ళమవుతాం,'' అన్నాడు మంత్రి.

''మన అశ్వికుల నాయకుడు, దొరికిన వాడు కాళీవర్మే అని కబురుచేశాడు గదా?'' అన్నాడు రాజు జితకేతుడు.

''ఇంత పెద్ద చంద్రశిలానగర రాజ్యంలో, ఎంతమందైనా కాళీవర్మ పేరుగల వాళ్ళుం డవచ్చు. కనక, తమరు స్వయంగా వెళ్ళి, అతణ్ణి విచారించి, శిక్షించటం మంచిది,'' అన్నాడు మంత్రి.

రాజు అందుకు సరేనంటూ బయలు దేరాడు. రాజూ, మంత్రీ భవనం ముందున్న ఆవరణను చేరేసరికి, అక్కడ చాలామంది ప్రజలు చేరి వున్నారు. మంత్రి ఆజ్ఞాపించ గానే అశ్వికభటులు, కాళీవర్మ చేతులకు బిగించిన తాళ్ళు విప్పి, అతణ్ణి గుర్రం మీది నుంచి దిగమన్నారు.

కాళీవర్మ గుర్రం దిగి, నిర్భయంగా రాజూ, మంత్రులకేసి తేరిపారజూస్తూ, ''మహారాజా, తమ సైనికులు అరణ్యంలో నా మీద హఠాత్తుగా వచ్చి పడి బంధించి, నన్ను చాలా అవమానపరిచారు. ఇందుకు వాళ్ళను శిక్షించకోరుతున్నాను,'' అన్నాడు.

ఆ మాటలకు రాజు జితకేతుడు ఆశ్చర్య పోతూ, మంత్రితో, ''మహామంత్రీ, ఇవేం అవివేకమైన పలుకులు? నా ఈ పదేళ్ళ

పరిపాలనలో నిందితుడెవడూ ఇలా దురుసుగా మాట్లడటం వినలేదే!'' అన్నాడు.

మంత్రి కోపంగా చేయి ఎత్తి, ''ఏయ్, పొగరుబోతా! మహారాజుగారి అనుమతి లేకుండా మాట్లాడినందుకు, నీకు ఈ క్షణంలోనే శిరశ్ఛేద శిక్ష విధించవలసి ఉంది. అయినా, నువ్వు ఎవరివైనదీ ముందుగా తెలుసుకోవలసివున్నది గనక, బతికిపోయావు. చంద్రశిలా నగర రాజ్యపు అరణ్యంలోని దారిదోపిడీగాళ్ళను, ఉదయగిరి రాజ్యంలో ప్రవేశపెట్టిన వాడివి నువ్వేనా? నీ పేరేమిటి?'' అన్నాడు.

''నా పేరు కాళీవర్మ, నేనీ రాజ్య పౌరుణ్ణే! గ్రామాలమీద పడి ప్రజల ధన ధాన్యాలు దోచుకునే దొంగల్ని, ఆ గ్రామస్థుల సాయంతో ఎదుర్కొని, వాళ్ళల్లో కొందరిని చంపిన మాట నిజమే. ప్రాణ భయం కొద్దీ మిగిలినవాళ్ళు సరిహద్దు దాటి ఉదయగిరి రాజ్యపు అరణ్యాల్లోకి పారిపోయి ఉంటారు. అందుకు నేనెలా బాధ్యుణ్ణవుతాను?'' అన్నాడు కాళీవర్మ గంభీరంగా.

ఆ జవాబుకు మంత్రి మరింత కోపంతో ''మహారాజా, నేనడిగిన చిన్న ప్రశ్నకు నిందితుడు అంత ఘాటైన పెద్ద జవాబివ్వటమే కాక, ఎదురు ప్రశ్నలు కూడా వేస్తున్నాడు. నిందితుణ్ణి తగిన విధంగా శిక్షించండి,'' అన్నాడు.

రాజు జితకేతుడు, ''ఇతడు మనం శిక్షించదలచిన కాళీవర్మే అన్న మాట! ఏయ్, వర్మా! నువ్వు నా అనుమతి లేకుండా, నా పౌరులైన కొందరిని చంపటమేగాక, పొరుగు



రాజుతో కలహకారణం అయినందుకు, నీకు మరణశిక్ష విధిస్తున్నాను,'' అన్నాడు.

ఆ మాట వింటూనే కాళీవర్మ ఉలిక్కిపడి, ''మహారాజా, ఇదే న్యాయసూత్రానికి అనుగుణమైన శిక్ష? నా తండ్రి తమ తండ్రిగారి కొలువులో సైనికోద్యోగిగా ఉంటూ, ఒకయుద్ధంలో ప్రాణాలు కోల్పోయాడు. నేను తమ దగ్గర ఉద్యోగం కోసం, పుట్టి పెరిగిన గ్రామం వదిలి ఇంత దూరం వచ్చాను. ప్రజా కంటకులైన బందిపోటు దొంగలను వేటాడినందుకు, నాకు మరణశిక్షా?'' అన్నాడు.

''ఇది అధిక ప్రసంగం,'' అని, మంత్రి సైనికులతో, ''మహారాజుగారి ఆజ్ఞ విన్నారుగదా? ఈ కాళీవర్మను నగర పొలిమేరల్లోని దిరిసెన చెట్ల తోపులో ఉరి తీసి, శవాన్ని ఉదయగిరిరాజు దుర్ముఖుల వారి సన్నిధికి పంపండి,'' అన్నాడు.



మంత్రి ఇలా అనగానే, అక్కడ చేరిన జనంలో కలకలం బయలుదేరింది. వాళ్ళల్లో కొందరు పెద్దగా గొంతులెత్తి, "ఇది చాలా అన్యాయం! మహారాజుగారు తాము విధించిన శిక్ష గురించి మరోసారి ఆలోచించాలి," అంటూ కేకపెట్టారు.

"మహారాజుగారికే సలహాలివ్వగలిగినంత వివేకులు నగరంలో వున్నారన్న మాట, ఆశ్చర్యం!" అంటూ మంత్రి పళ్ళు కొరికి, సైనికులతో, "ఆ కేకలువేసే రాజద్రోహుల్ని పట్టి, ఖైదులో వేయండి," అన్నాడు.

మంత్రి ఇలా అనగానే సైనికులు తమ గుర్రాలను గుంపులుగా వున్న జనంకేసి ఉరికించారు. వాళ్ళు భయకంపితులై చెల్లాచెదురుగా పారిపోసాగారు. అది చూసి రాజు జితకేతుడు తృప్తిగా నవ్వి, "దండనీతి ఒక్కటే, ఈ అలగాజనాన్ని అదుపులో పెట్టగలదు. సమయానికి తగినఆజ్ఞ ఇచ్చారు, మహామంత్రీ!" అంటూ మంత్రిని మెచ్చుకుని, తన భవనంకేసి బయలుదేరాడు.

జనాన్ని దూరంగా తరిమివేసింతరవాత అశ్వసైనికుల నాయకుడు, కాళీవర్మ దగ్గిరకువచ్చి, "రాజాజ్ఞ విన్నావుగదా? పాపం, ఇంత చిన్న వయసులోనే, నువ్వీ లోకం వదిలిపోతున్నందుకు, నాకు కాస్త విచారంగానేఉన్నది. కాని,రాజాజ్ఞ," అన్నాడు.

కాళీవర్మ ఉగ్రుడైపోయి, కత్తి దూయబోయినవాడల్లా, ఇది అదను కాదనుకుంటూ ఆగి, "నువ్వనే రాజాజ్ఞ ఎంత బుద్ధిహీనమైనదో, ఇక్కడ చేరిన నగర వాసులకు తప్ప, మీలో మరెవరికీ అర్థమైనట్టులేదు. పరాయి రాజుకు భయపడి ప్రజలకు మేలు చేసిన నన్ను, ఈ జితకేతురాజు ఉరితీయించబోతున్నాడు," అన్నాడు.

"రాజ్యక్షేమం రాజుకే తెలియాలి; నీకూ, నాకూ ఎలా తెలుస్తుంది? సరే, బయలుదేరు. నిన్ను ఉరితీసే దిరిసెన చెట్లతోపు చేరే లోపల రాజుగారు దయతలచి, నీ శిక్ష రద్దుచేస్తూ ఆజ్ఞాపత్రం పంపినా పంపవచ్చు. లోగడ కొందరు నిందితులు ఆఖరిక్షణంలో ఆ విధంగానే ఉరిశిక్షలు తప్పించుకున్నారు," అన్నాడు అశ్వికుల నాయకుడు.

కాళీవర్మకు అలాంటి ఆశ ఏమీ లేదు. కాని, ఏదో విధంగా తాను ఉపాయంతో, ఈ సైనికుల నుంచి పారిపోవాలనుకున్నాడు.

అశ్వికుల నాయకుడు తన అనుచరులందర్నీ హెచ్చరించి, కాళీవర్మతో, "నీకిప్పుడు చేతులకు సంకెలలు తగిలించవలసి ఉంది; ఏదీ చేతులు చాచు," అంటూ దగ్గిరకు వచ్చాడు.

''ఇక కొద్ది క్షణాల్లో చావబోతున్న నాకు, ఈ సంకెళ్ళ బెడద ఎందుకు? నేను పారిపోతాననే గదా, నీ భయం? ఇదిగో, కావాలంటే నా కత్తి తీసుకో. ఇంత మంది ఆయుధధారుల మధ్య నుంచి, నిరాయుధుడనైన నేను ఎలా తప్పించుకోగలను?'' అంటూ కాళీవర్మ ఒర నుంచి కత్తినిలాగి ఆశ్వికుల నాయకుడికి ఇచ్చాడు.

ఆశ్వికుల నాయకుడు కత్తి తీసుకుని తృప్తిపడి, ''కాళీవర్మా, చావబోయే వాడి కోర్కె తీర్చటం పుణ్యం అన్నారు. ఒక వేళ నువ్వు పారిపోయేందుకు ప్రయత్నించావో, మేం పదిమంది అశ్వికులం! పది కత్తులు నీ శరీరాన్ని తూట్లు పొడిచి, నిన్ను పరలోకయాత్ర చేయించగలవు, జాగ్రత్త!'' అన్నాడు.

తరవాత కాళీవర్మను మధ్య ఉంచి, ముందు ఐదుగురు ఆశ్వికులూ, వెనకగా ఐదుగురు ఆశ్వికులూ నగర పొలిమేరల కేసి బయలుదేరారు.

ఒక గంట తరవాత అందరూ నగర పొలిమేరల్లోని దిరిసెన చెట్ల ప్రాంతాన్ని చేరారు. దాపుల్లో ఎత్తయిన కొండలున్నవి. ఒక కొండచరియ మీది నుంచి జలపాతం ఒకటి ఇరవై ముప్పై అడుగుల దిగువ నున్న బండరాళ్ళ మీద పడుతూ భయంకరంగా శబ్దం చేస్తున్నది.

ఆశ్వికులతో పాటు చెట్ల మధ్యకు పోతూనే కాళీవర్మ ''ఇక్కడా నన్ను, మీరు ఉరితీయబోతున్నది?'' అన్నాడు తప్పించుకుపోయేందుకు మార్గం ఏమిటా అని నలుదిక్కులూ పరికించి చూస్తూ.

ఆశ్వికుల నాయకుడు, ఏదో జవాబివ్వబోయేంతలో, ఒక ఎనుబోతు మీద ఎక్కిన నల్లని ఆకారం ఒకటి వాళ్ళ కంటబడింది. ఎనుబోతు మీద వున్నవాడు తల నుంచి



కాళ్ళ వరకూ నల్లని దుస్తులు ధరించి ఉన్నాడు. వాటికి కళ్ళదగ్గిర మాత్రం కంతలున్నవి.

ఆ ఎనుబోతు రౌతు చేతిలో వున్న గండ్రగొడ్డలిని పైకెత్తి పట్టుకుని, అశ్వికుల కేసి వేగంగా వస్తూ, "ఎవరు, మీరు? ఈ ప్రధాన తలారి లోగడ శిరశ్ఛేదం చేసినవాళ్ళ ప్రేతాలా లేక కొత్తగా తలలు నరికించుకోవ టానికి వచ్చిన వాళ్ళా?" అన్నాడు భీకరంగా.

ఎనుబోతు తమకేసి వేగంగా రావడం చూస్తూనే గుర్రాలు బెదిరి, పెద్దగా సకి లిస్తూ అటూ ఇటూ పరుగెత్తినై. పారిపో యేందుకు ఇది చక్కని అవకాశం అను కుంటూ కాళీవర్మ తన గుర్రాన్ని ముందుకు దూకించబోయేంతలో, ఎనుబోతు మీద వున్నవాడు మెరుపులా వచ్చి గుర్రం కళ్ళెపు తాళ్ళను వడిసి పట్టుకుని, "దిరిసెన చెట్లంటే భూత ప్రేత పిశాచాలకు ఎంతో ఇష్టం! అందుకే రాజుగారు దొంగలకూ, దేశద్రోహులకూ మరణశిక్షలు ఇక్కడ అమలు చేస్తున్నారు. నువ్వు దొంగవా, దేశ ద్రోహివా?" అని ప్రశ్నించాడు.

"నేను ఆ రెంటిలో ఏదీ కాదు. నువ్వే జాతి పిశాచానివి?" అన్నాడు కాళీవర్మ కళ్ళెపు తాళ్ళను ఎనుబోతువాడి నుంచి లాక్కునేందుకు ప్రయత్నిస్తూ.

అంతలో అక్కడికి చెల్లాచెదరైన అశ్విక లందరూ వచ్చి చేరారు. అశ్వికుల నాయ కుడు కోపంగా, ఎనుబోతు రౌతును, "ఒరే, ఈ గత్తరంతా ఏమిటి? నిన్నేమైనా పిశాచి పట్టిందా?" అన్నాడు కసురుతూ.

ఎనుబోతువాడు కాళీవర్మ గుర్రపు కళ్ళెం తాళ్ళను వదిలి, "నగర ప్రధాన తలారినే ఒరే, అరే అంటున్నావా? రాజుగారు ఏ రోజున అయినా, నీకు శిరశ్ఛేద శిక్ష వేసి, నాదగ్గరకు పంపవచ్చు. అప్పుడు నిన్ను నా మొండి గొడ్డలితో, ఎండు మోడును నరికినట్టు నరుకుతాను," అన్నాడు.

"తాగుబోతు వెధవా, ఈ అవమానాన్ని నేను సహించను!" అంటూ అశ్వికుల నాయ కుడు చప్పున కత్తి దూశాడు. ఆ మరుక్షణం కాళీవర్మ మెరుపువేగంతో తలారిచేతి నుంచి గండ్రగొడ్డలిని లాక్కుని, అశ్వికుల నాయకుడి కుతం మీదబలంగా కొట్టాడు. అశ్వికుల నాయ కుడి తల తెగి కింద పడేంతలో, దూరంనుంచి, "జై ఆదిభల్లూకా! ధైర్యశాలివిరా, యువకా!" అన్న కేక వినిపించింది. - (ఇంకావుంది)



బేతాళ కథలు

# శంతనుడి నిర్ణయం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ, క్షుద్ర శక్తులూ, విషసర్పాలూ విచ్చలవిడిగా తిరుగాడే ఈ శ్మశానంలో నువ్వెవరివైనదీ తెలియనివాడు, నిన్నేదో క్షుద్రదేవో పాసకుడుగానో, తాంత్రికవేత్తగానో పొరబడే అవకాశమున్నది. కానీ, నువ్వొక దేశపాలకుడివైన రాజువు! అయినా, నువ్వు ఎన్నో శ్రమలకోర్చి ఈ శ్మశానంలో తిరుగాడుతున్నావంటే, ధర్మం న్యాయం నీ పక్షాన ఉన్నదనీ, ఆ కారణంగా విజయం



తథ్యమనీ భావిస్తున్నట్టు కనబడుతున్నది. అయితే, కొన్ని సందర్భాలలో శాసించే అధికారం వున్న వ్యక్తుల కారణంగా అలాంటివి మరుగున పడడం జరుగుతూంటుంది. ఇందుకు ఉదాహరణగా శంతనుడనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

శంతనుడనే రాజుకు ఇద్దరు కొడుకులున్నారు. పెద్దవాడు కుంతలుడు, శాంత స్వభావుడు. చిన్నవాడు చిత్రాంగుడు, దుడుకు మనిషి.

తన బిడ్డలిద్దరూ సకల శాస్త్రాలూ అభ్యసించారనీ, అస్త్ర శస్త్రవిద్యలలో ఆరితేరారనీ నిర్ధారణ చేసుకున్నాక, వారిలో రాజ్యం ఎవరికప్పగించాలా అన్నది శంతనుడికి సమస్యగా మారింది. మామూలుగా అయితే, సింహాసనానికి వారసుడు కుంతలుడే! అయితే శంతనుడి తర్వాత తనే రాజు కావాలని చిత్రాంగుడు మొండిపట్టు పట్టాడు. కుంతలుడు కూడా అందుకు అభ్యంతరం చెప్పక, తండ్రితో, ''తమ్ముడంతగా మనసు పడుతున్నప్పుడు, అతడికే పట్టాభిషేకం చెయ్యండి. నేను తమ్ముడికి చేదోడు వాదోడుగా ఉంటాను,'' అన్నాడు.

''అన్నయ్యక్కూడా అభ్యంతరం లేనప్పుడు, నేనే రాజును కావడానికి మధ్య మీ అభ్యంతరం దేనికి?' అన్నాడు చిత్రాంగుడు తండ్రితో.

''అన్నదమ్ముల్లో పెద్దవాడికే సింహాసనమివ్వడం, ఈ దేశపు సంప్రదాయం. ఆ సంప్రదాయాన్ని పాటించడానికి, నీ అభ్యంతరం దేనికి?'' అని చిత్రాంగుణ్ణి ఎదురుప్రశ్న వేశాడు తండ్రి.

''నేను రాజును కావాలనుకుంటున్నాను. అన్నయ్య అనుకోవడం లేదు. కావాలన్న వాళ్ళను వదిలి వద్దన్నవాణ్ణి రాజును చేయడం మంచి సంప్రదాయం కాదు,'' అన్నాడు చిత్రాంగుడు.

''అలాంటప్పుడు నా కుటుంబంలోని వాడే రాజు కావాలనుకోవడమూ మంచి సంప్రదాయం కాదు. దేశంలోని యువకుల్లోకెల్లా సమర్థుడైన వాడికే రాజ్యం ఇవ్వాలి, అవునా?'' అని అడిగాడు శంతనుడు నవ్వుతూ.

దీనికి చిత్రాంగుడు ఏమాత్రమూ చలించకుండా, ''మన ప్రజలందరికీ రాజ కుటుంబీకులంటే అపారమైన గౌరవముంది. దేశంలో వేరెవ్వరికీ అంత గౌరవం లభించదు,'' అన్నాడు.

అప్పుడు శంతనుడు, ''మన ప్రజలు, కుంతలుడు పెద్దవాడు గనుక, అతణ్ణే ఎక్కువగా గౌరవిస్తున్నారు. అందుకే నేను కుంతలుణ్ణి రాజును చేయాలనుకుంటు న్నాను,'' అన్నాడు.

''నేను నమ్మను!'' అన్నాడు చిత్రాంగుడు చిరాకుపడుతూ.

శంతనుడు బాగా ఆలోచించి, కొడుకు లిద్దర్నీ దేశాటనకు పంపాడు. వారినెలా ప్రజలు ఆదరిస్తున్నారో తెలుసుకునేందుకు చారుల్ని నియమించాడు.

దేశప్రజలందరికీ రాజకుమారుల స్వభావాల గురించి తెలుసు. అందువల్ల, వాళ్ళు చిత్రాంగుణ్ణి ఎక్కువగా గౌరవించారు. కుంతలుణ్ణి అభిమానంగా ఆదరించినా, అతడి విషయంలో ఎటువంటి ఆర్భాటం చేయలేదు.

దేశాటన పూర్తయ్యాక చిత్రాంగుడు, తండ్రిని కలుసుకుని, ''మీరు నియమించిన చారులద్వారా నిజం ఈ పాటికి తెలుసుకునే ఉంటారు. ప్రజలకు అన్నయ్యకంటే నేనంటేనే గౌరవం ఎక్కువ,'' అని చెప్పాడు గర్వంగా.

''కుంతలుణ్ణి ప్రజలు తమ మనిషిగా అభిమానించారు. అతడు ప్రజల మనిషి. మన ప్రజలకు నీవంటే భయం. ప్రజలు అభిమానించే మనిషే రాజు కావాలి,'' అన్నాడు శంతనుడు.

చిత్రాంగుడికి చాలా కోపం వచ్చింది. ''ప్రజలు అభిమానించే వాడు, వారిలో ఒకడు కాగలడు కానీ వారికి ప్రభువు కాలేడు. రాజంటే ప్రజలకు భయం, భక్తి,



గౌరవం ఉండాలి. ఆ మూడూ ప్రజలకు నాపైన ఉన్నాయి. కాబట్టి న్యాయంగా నేనే రాజును కావాలి,'' అన్నాడు.

శంతనుడు నవ్వి, ''ఈ సంగతి గ్రహించు! నీవు రాజువు కాగానే, నీ పాలన సమర్థవంతంగా లేకపోతే ప్రజలు నిన్ను గౌరవించడం మానేస్తారు,'' అన్నాడు.

''అలా అయితే, అన్నయ్యతో పోటీ పడి నా సామర్థ్యాన్ని ఋజువు చేసుకుంటాను. అందుకు నాకు అవకాశమివ్వండి,'' అన్నాడు చిత్రాంగుడు.

''అయితే విను! రాజధాని పొలిమేరలో ఒకదాని పక్క ఒకటిగా మూడు తాడిచెట్లున్నాయి. వాటిపైన దుష్టగ్రహాలు నివాసం ఏర్పాటు చేసుకున్నాయని పుకారు లేచింది. ఇరవై సంవత్సరాల క్రితం నేను ఒక్క కత్తివేటుతో చెట్లు మూడింటినీ



నరికేశాను. సర్వసాధారణంగా, తాడిచెట్టు ఒకసారి నరకబడిన తర్వాత మళ్ళీ చిగిర్చి ఆకులు తొడగదు. అయితే, ఇప్పుడా చెట్లు మళ్ళీ పెరిగి పెద్దవయ్యాయి. అంటే, మళ్ళీ వాటిమీద దుష్టగ్రహాలు చేరి ఉండాలి. ఆ ప్రభావంవల్లే నీకు రాజు కావాలన్న పెడ బుద్ధి పుట్టిందేమో అన్న శంక కలుగుతు న్నది. సరే, ఒక్క వేటుతో ఆ మూడు చెట్లనూ నరకగలవా?'' అని ప్రశ్నించాడు శంతనుడు.

''తప్పకుండా నరకగలను!'' అని చిత్రాం గుడు ఒక్క క్షణం ఆగి, తన అన్న ఆ ప్రయ త్నంలో విఫలుడవుతాడన్న నమ్మకంతో, ''ముందు అన్నయ్యను ప్రయత్నించ మనండి,'' అన్నాడు.

శంతనుడు, కుంతలుడికి విషయం చెబితే, ''నేనా మూడు చెట్లనూ ఒక్క వేటుతో నరకగలననే, నా నమ్మకం. అప్పుడిక తమ్ముడికి తన సామర్థ్యాన్ని నిరూపించు కునే అవకాశం ఉండదు. కాబట్టి, అతడినే ప్రయత్నించనివ్వండి,'' అన్నాడు.

దీనికి చిత్రాంగుడెంతో సంతోషించాడు. ఆ తర్వాత అతడు మూడు తాడిచెట్లనూ ఒకే ఒక్క వేటుతో తెగనరికి అందర్నీ ఆశ్చర్యపరి చాడు. అయితే, శంతనుడు, చిత్రాం గుడితో, ''నేనొకప్పుడు దేశానికి దుష్టగ్రహాల పీడ వదిలించాలని వాటిని నరికాను. నీవు ఇప్పుడు రాజువు కావాలని వాటిని నరికావు. స్వార్థం వంటబట్టినవాడు రాజైతే, అతడు దేశానికే దుష్టగ్రహంగా మారతాడు,'' అన్నాడు.

''ఇది చాలా అన్యాయం. నేను కూడా ఆ చెట్లను దుష్టగ్రహాల బారి నుంచి మన ప్రజలను తప్పించాలనే నరికాను. ఒక పని చెయ్యండి! నాకూ, అన్నయ్యకూ చెరో నగరం ఇవ్వండి. ఒక సంవత్సరం పాటు మేము వాటిని పరిపాలిస్తాం. అప్పుడు మా పరిపాలనపై ప్రజల తీర్పు ఏమిటో మీరే తెలుసుకుంటారు. ఆ తర్వాత మీరు తీసుకునే న్యాయమైన నిర్ణయాన్ని, నేను శిరసావహిస్తాను,'' అన్నాడు చిత్రాంగుడు.

శంతనుడు ఆ ప్రకారం కుంతలుడికి ధర్మపురినీ, చిత్రాంగుడికి సత్యపురినీ ఇచ్చాడు. ఇద్దరూ సంవత్సరం పాటు ఆ నగరాలను పరిపాలించారు.

తను అధికారంలోకి రాగానే కుంతలుడు ధర్మపురిలో ప్రముఖులందరినీ సమావేశ పరిచి, నగరానికున్న సమస్యలేమిటో తెలుసుకున్నాడు. పలువురి సహకారంతో సమర్థులను ఎన్నిక చేశాడు. అందరికీ పూర్తి

స్వేచ్ఛనిచ్చాడు. ఎవరైనా సరే ఎప్పుడైనా సరే అతడిని కలుసుకోవచ్చు. పేద, గొప్ప తారతమ్యం లేకుండా, కుంతలుడు అందరిలోనూ కలిసిపోయేవాడు. అతడు ఎక్కువగా పేదల ఇంటనే భోజనం చేస్తూ, వారి కష్టసుఖాలు తెలుసుకునేవాడు.

ఇక, అధికారంలోకి రాగానే, చిత్రాంగుడు సత్యపురికి నియంతగా మారాడు. తనకు తోచిన వారిని, తనను పొగిడేవారిని నగర పాలనకు ఎన్నిక చేశాడు. రకరకాల విందులు, వేడుకలను ప్రోత్సహించేవాడు. తనకు ఎదురు తిరిగినవారిని కఠినంగా శిక్షించేవాడు. అతడి పాలనలో ఎప్పుడు ఎవరికి మూడుతుందోనని సాధారణ పౌరులు ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని ఉండేవారు.

ఒక ఏడాది పాలనలో రెండు నగరాలూ చెప్పుకోదగ్గ అభివృద్ధి సాధించాయి.

శంతనుడు, చారుల ద్వారా రెండు నగరాల పౌరుల అభిప్రాయాలూ సేకరించాడు. సత్యపురి పౌరులందరూ ఏకకంఠంతో దేశానికి చిత్రాంగుడే తగిన రాజని అన్నారు. ధర్మపురి ప్రజలు కూడా ఇంచుమించు ఏకకంఠంతోనే, కుంతలుణ్ణి నగర పాలకుడిగా ఉంచడమే మంచిదని అన్నారు.

శంతనుడు కుమారులిద్దరినీ తన వద్దకు రప్పించుకుని జరిగినదంతా చెప్పి, ''ప్రజాభిప్రాయ సేకరణ కూడా పూర్తయింది. కుంతలుడికే పట్టాభిషేకం జరిపించాలని నిర్ణయించాను,'' అన్నాడు.

కుంతలుడు నవ్వి, ''అంతా మీ ఇష్టం!'' అన్నాడు.



చిత్రాంగుడు మాత్రం మండిపడుతూ, ''ప్రజాభిప్రాయాన్ని సేకరిస్తే సరిపోతుందా? దాన్ని అమలు చేయరా?'' అని అడిగాడు.

అప్పుడు శంతనుడు గంభీరంగా, ''మన దేశంలో చాలా నగరాలున్నాయి. ఆ నగర పాలనలో రాజు జోక్యముండదు. నగర పాలకుడు సమర్థుడైతే, రాజు అసమర్థుడైనా నగరం వర్ధిల్లుతుంది. నగర పాలకుడు అసమర్థుడైతే, రాజు సమర్థుడైనా నగరం అష్టకష్టాల పాలవుతుంది. ఇది ధర్మపురి, సత్యపురి పౌరులకు తెలుసు. అందుకే నేను కుంతలుడికే పట్టాభిషేకం చేయబోతున్నాను. ఇది, నా తిరుగులేని నిర్ణయం,'' అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, శంతనుడి నిర్ణయం ధర్మం, న్యాయాలకు విరుద్ధంగా లేదా? అతడు మొదటినుంచీ కుంత

లుడి పట్ల పక్షపాతం కనబరుస్తున్నట్టు తెలుస్తూనే ఉన్నది కదా! ఐనా, నగర పాలన విషయమై అతడు పెట్టిన పరీక్షలో చిత్రాంగుడు నెగ్గాడు. ప్రజలు అతణ్ణి రాజును చెయ్యమని కోరారు. కుంతలుణ్ణి నగర పాలకుడిగా ఉంచడం మంచిదన్నారు. అలాంటప్పుడు, రాజు శంతనుడు, ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా కుంతలుడికి పట్టాభిషేకం చేయాలనుకోవడం ధర్మవిరుద్ధం కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ధర్మం, సత్యం అనేవి సర్వత్రా ఆదరణీయమైనవైనా, ఒక్కొక్కసారి సమయ సందర్భాలను బట్టి అవి రాజనీతికి అననుకూలంగా పరిణమించే అవకాశమున్నది. అంతేకాక ధర్మం, సత్యం కాలాతీతమైనవేం కావు. కాలానుగుణంగా వాటిలో మార్పు జరుగుతూ ఉంటుంది. ధర్మపురి ప్రజలు కుంతలుడు దేశానికి రాజుగా తగడనటంలో, వాళ్ళు ఒక వాస్తవాన్ని గ్రహించినట్టు కనబడుతున్నది. నగర పాలకుడుగా అతడు అందరికీ ఆదరణీయుడైన వాడు. అలాంటి వాడు రాజైతే, తమకు ఎలాంటి నగర పాలకుడు రాగలడో అన్న భయం వారికున్నది. అందుకే, ఆదర్శ పాలకుడైన కుంతలుణ్ణి వారు వదులుకోవటానికి ఇష్టపడలేదు. ఇక, సత్యపురి పౌరుల విషయానికొస్తే, వాళ్ళు చిత్రాంగుణ్ణి త్వరగా తమ నగర పాలక అధికారం నుంచి తప్పించాలన్న అభిప్రాయంలో ఉన్నట్టు కనబడుతున్నది. అతడు తన మిత్రులకూ, పొగిడేవారికీ తప్ప ప్రజలకు చేసిన మేలు ఏమీ కనబడదు. ఆ కారణంగా అతణ్ణి వదిలించుకునేందుకు రాజును చేయమని కోరారు. ఏ నాయకుణ్ణి ప్రజలు వదులుకునేందుకు ఇష్టపడరో, అతడే దేశానికి తగిన రాజు! ఈ రాజనీతి సూత్రం ఎరిగిన శంతనుడు, కుంతలుడికి పట్టాభిషేకం చేయ నిర్ణయించాడు. ఇది ధర్మానికీ, సత్యానికీ విరుద్ధమేం కాదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. - కల్పితం.

[ఆధారం : ''వసుంధర'' రచన]






## కర్ణాటక సముద్ర తీరాలు!



దక్షిణ భారత రాష్ట్రమైన కర్ణాటక 200 మైళ్ళ పొడవైన సముద్రతీరం కలిగి వుంది. ఇందులో సగభాగం 24 సముద్ర తీరప్రాంతాలుగల ఉత్తర కర్ణాటక జిల్లాలోనే ఉంది. ఈ ఇరవై నాలుగు బీచ్‌లు కూడా ఎంతో పరిశుభ్రంగా పరిరక్షించబడుతున్నాయి. అందమైన ఇసుక తిన్నెలు - స్థానికులను, పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. ఒక బీచ్ ఓమ్ ఆకారంలో ఉండడంవల్ల అధిక సంఖ్యాకులైన ప్రజలు దీనిని సందర్శిస్తున్నారు. దీనిని 'ఓమ్ బీచ్' అనే అంటారు. మరో సుప్రసిద్ధమైన బీచ్ పేరు రవీంద్రనాథ్ టాగూర్ బీచ్.

## సరస్వతి ఆవిర్భావం!

భౌతికంగా ఆధారాలు కనిపించకపోయినప్పటికీ మన దేశంలోని ముఖ్యమైన నదులలో ఒకటిగా సరస్వతిని పరిగణిస్తారు. అలహాబాదు వద్ద త్రివేణీ సంగమంలో సరస్వతీ నది గంగా యమునా నదులతో అంతర్వాహినిగా వచ్చి సంగమిస్తున్నది అన్నది మన తరతరాల విశ్వాసం. కనుమరుగైపోయిన సరస్వతీ నది ఆవిర్భావప్రదేశాన్ని కనుగొనడానికి మన భారత పురాతత్వ శాఖ హర్యానాలో తవ్వకాలు జరిపింది. ఆదిబద్రి అనే ప్రదేశంలో కుండపెంకులు, పనితనం నిండిన పలకలు, రకరకాల బొమ్మలు, మంటపం, ధ్యానమందిరం, బుద్ధవిగ్రహం బయట పడ్డాయి. వీటన్నిటినీ నదీ తీరంలో ప్రజలు నివసించారనడానికి ఆధారంగా చెబుతారు. ఆ నది సరస్వతి అయివుంటుందని పురాతత్వవేత్తలు భావిస్తున్నారు. సరస్వతీ నదీ తీరంలో వెలసిన అనేక స్థలాలలో ఆదిబద్రి ఒకటని వాళ్ళు అభిప్రాయపడుతున్నారు.



పురాణ గాథలు - *20*

# అర్ధరాత్రి దెబ్బలాట!



విజయుడు, విపులుడు అనే ఇద్దరు ప్రయాణీకులు కొండమార్గం గుండా చాలా దూరం ప్రయాణం చేసి ఒక సత్రం చేరుకున్నారు. వారిద్దరికీ గంట క్రితమే పరస్పరం పరిచయమయింది. ఇద్దరూ చేరుకోవలసిన గమ్యస్థానం కూడా ఒకటే కావటంతో కలిసే ప్రయాణం చేయాలని నిర్ణయించారు.

ఇద్దరూ దారి పక్క పూటకూళ్ళ ఇంట భోజనం చేశారు. విపులుడు మాత్రం దాపుల లభించే పానీయాలను పీకల దాకా తాగాడు.

పొద్దుటి నుంచి నడవడం వల్ల ఇద్దరూ బాగా అలిసిపోయారు. అర్ధరాత్రయ్యింది. అప్పుడే సత్రంలోని రెండు గదులూ ఖాళీ అయ్యాయని తెలియడంతో చాలా సంతోషించారు. ఒక గది మేడమీది తొలి అంతస్థులోనూ, రెండవ గది రెండో అంతస్థులోనూ ఉన్నాయి.

సత్రం యజమాని సంగతి చెప్పి, "అయ్యలారా, రెండు గదులూ మీ అదృష్టంకొద్దీ ఇప్పుడే ఖాళీ అయ్యాయి. శుభ్రపరిచాము. రెండు గదుల్లోనూ లాంతర్లు ఉన్నాయి. వెళ్ళి చూడండి. ఇద్దరికీ ఒక గది చాలో, చెరొక గది కావాలో చూసి చెప్పండి," అన్నాడు.

ఇరుకుగా ఉన్న మెట్ల గుండా విపులుడు పైకి వెళ్ళడానికి విజయుడు సాయపడ్డాడు. మొదటి అంతస్థును చేరగానే విపులుడు, "నేను ఇక్కడే ఉంటాను. నువ్వు పైకి వెళ్ళి పైనున్న గదిని చూసిరా. అక్కడ గాలి బాగా వచ్చేట్టయితే, నేను వెళ్ళి అక్కడ పడుకుంటాను. ఈ గదిలో ఉక్కపోస్తున్నది," అన్నాడు విజయుడితో.

విజయుడు పైకి వెళ్ళి, కొంత సేపటికి తిరిగి వచ్చి, "రెండో అంతస్థులోని గది విశా

లంగా, మంచి గాలి వీచేలా ఉంది. ఇద్దరం అక్కడే పడుకుందాం,'' అన్నాడు విపులుడితో.

''వద్దు, మిత్రమా! వద్దు! ఆ గదిలో నేనొక్కణ్ణే పడుకుంటాను. వేరొకరు నా గదిలో ఉండడం నాకిష్టం ఉండదు,'' అన్నాడు తడ బడే మాటలతో విపులుడు చేతుల అడ్డంగా ఊపుతూ. మితిమించి మత్తు పానీయం పుచ్చుకోవటం వల్ల మతిచెడినవాడిలా, ''నేనొక్కణ్ణే అక్కడ పడుకుంటాను. నువ్వు ఇక్కడే ఉండు,'' అంటూ చెప్పిన మాటే మళ్ళీ మళ్ళీ చెప్పసాగాడు.

తాగిన వాడితో పాటు ఒకే గదిలో పడుకుని వాడి బాధ భరించే శ్రమ తప్పిం దని విజయుడు కూడా లోలోపల సంతోషిం చాడు. ''మంచిది అలాగే చేద్దాం. రా నిన్ను ఆ గదిలో వదిలి వస్తాను,'' అంటూ విజ యుడు, ఒక చేత్తో విపులుడి సంచీ తీసుకుని, రెండో చేయిని అతడికి ఆసరాగా అందించ బోయాడు. అయితే విపులుడు పట్టరాని ఆవేశంతో, ''నేనేం పసిబిడ్డనా లేక తప్పతాగి ఉన్నాననుకుంటున్నావా? ఈ మేడమీద మెట్లు కాదు. తలుచుకుంటే వింధ్య పర్వతాన్ని కూడా అవలీలగా ఎక్కగలను ఏ ఆసరా లేకుండా. ఏమనుకుంటున్నావో ఏమో,'' అంటూ సంచీని లాక్కుని తూలుతూ మెట్లెక్క సాగాడు.

''మంచిది. అలాగే. ఒంటరిగానే వెళ్ళు. నేను రాలేదు,'' అంటూ విపులుడు వెళ్ళాక తన గది తలుపు మూశాడు విజయుడు.

విజయుడు ఆ గదిలోనే పడుకుని హాయిగా నిద్రపోయాడు. తెల్లవారుతూం డగా మెలకువ వచ్చింది. లేచి ప్రయాణానికి సిద్ధమయ్యాడు. వెళ్ళేముందు తన మిత్రుడు లేచాడేమోనని చూసి, తనతో వస్తాడేమో అడుగుదామని పైకి వెళ్ళాడు.

విపులుడు, గదిలోపల కాకుండా వెలుపల పడుకుని నిద్రపోతున్నాడు. విజయుడు అతన్ని మెల్లగా తట్టి లేపాడు. అతడు కళ్ళు నులుముకుంటూ లేచి కూర్చుని చుట్టుపక్కల కలయజూశాడు.



కొండలు చాలా ఉన్నతమైనవి. కొండల కన్నా భూమి చాలా ఉన్నతమైనది. భూమికన్నా విశ్వం చాలా ఉన్నతమైనది. అయితే, ప్రళయంలాంటి ఆపదలలో సైతం చలించని శాంత మనస్కులైన మహాత్ములు వీటన్నిటికన్నా ఉన్నతులు!

– భామినీవిలాసం



అతడి ముఖంలో అనుమానం, భయం కనిపిస్తున్నాయి. ఆ తరవాత అతడు విజయుడికేసి చూస్తూ, ''ఆ దుండగులు ఏమయ్యారు? నా సంచీని తీసుకుని పారిపోయి ఉంటారు,'' అన్నాడు.

''దుండగులా? నువ్వు తప్ప మరెవ్వరూ ఇక్కడ లేరు. నీ సంచీ గది లోపల ఉంది!'' అన్నాడు విజయుడు.

విపులుడు రాత్రి జరిగినంతా ఒకసారి గుర్తు చేసుకుని చెప్పసాగాడు. అతడు గదిలోకి అడుగు పెట్టగానే, లోపల దాగివున్న నలుగురు దుండగులు నాలుగు వైపుల నుంచి అతని మీదకి ఉరికారు. విపులుడు నలుగురితోనూ పోరాడాడు. అయితే, గది వెలుపలికి విసిరివేయబడి, స్పృహకోల్పోయి అలాగే అక్కడే ఎలా నిద్రపోయాడో మాత్రం అతనికి అర్థం కాలేదు.

అంతా విన్న విజయుడు వచ్చే నవ్వు ఆపుకుంటూ, ''మిత్రమా! నిన్ను ఈ గదిలోకి తెచ్చి వదిలి పెట్టి, ఇక్కడ నాలుగు వైపులా నాలుగు నిలువుటద్దాలు ఉన్నాయని నీకు చెప్పి వెళ్ళాలనుకున్నాను. అయినా నువ్వు రానిచ్చావు కావు. లాంతరు వెలుగులో నువ్వు గదిలో అడుగు పెట్టగానే అద్దాలలోని నీ ప్రతిబింబాలను చూసి నాలుగువైపుల నుంచీ నీ మీదకు వస్తున్న దుండగులుగా భ్రమపడి ఉంటావు. వాటితో తలపడి ఉంటావు. అదృష్టవశాత్తు అద్దాలేవీ పగిలి, నీకు గాయం తగలలేదు. బతికిపోయావు,'' అని వివరించాడు.

విపులుడు కొంతసేపు మౌనంగా ఉండిపోయాడు. ఆ తరవాత, ''అంటే, నేను నాతోనే దెబ్బలాడానన్న మాట!'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

''నిజమే. అజ్ఞానం కొద్దీ మనం తరచూ ఆ పనేచేస్తూ ఉంటాం,'' అన్నాడు విజయుడు.

– బిందుసార్





# వింత ప్రశ్నలు

సింగంపల్లి అనే గ్రామంలో, పున్నమాంబ అనే వృద్ధురాలు, తన కొడుకు, కోడలు వద్ద వుంటూ ప్రశాంతంగా జీవితం గడుపుతూండేది. కొడుకూ కోడలూ ఒకసారి పొలం పనులు చూసుకుని ఇంటికి తిరిగివస్తూండగా, ఉరుములూ మెరుపులతో పెద్దగా వర్షం ప్రారంభమై పిడుగు పడడంతో ఇద్దరూ మరణించారు. దాంతో వాళ్ల ఏకైక సంతానమైన పన్నెండేళ్ళ లతను పెంచి పెద్ద చేసే భారం పున్నమాంబ మీద పడింది.

ఈ జరిగిన విపత్తుకు పున్నమాంబ బెంబేలుపడిపోక, తమకున్న రెండెకరాల పొలాన్ని కౌలుకిచ్చి, మనవరాలితో కలిసి విస్తళ్ళూ, రకరకాల ఊరగాయ పచ్చళ్ళూ తయారు చేసి, జీవనానికి సరిపడా సొమ్ము సంపాదిస్తూ రోజులు గడపసాగింది.

ఈ విధంగా ఎనిమిది సంవత్సరాలు గడిచిపోయాయి. పున్నమాంబకు క్రమంగా నడుంనొప్పి మొదలయి పనులు చేయలేక సతమతం కాసాగింది. అంతేకాక కౌలుదారు ధాన్యం సరిగా ఇవ్వక ఇబ్బందిపెట్టడం ప్రారంభించాడు. తను చనిపోక ముందే మనవరాలిని ఎవరైనా కలవారి కుటుంబపు యువకుడికిచ్చి వివాహం జరిపించాలన్నది ఆమె ఆశ.

ఆమె బాగా ఆలోచించగా, తన కొడుకు స్నేహితుడు నాగయ్య అనే అతను పట్నంలో వున్నట్టు గుర్తుకు వచ్చింది. అతడు ఆ చుట్టుపక్కల లభించే సుగంధ ద్రవ్యాలు కొనుగోలు చేసి, ఇతర ప్రాంతాల నుంచి వచ్చే వర్తకులకు అమ్ముతూ లక్షలు గడించాడని ఆమె విని వున్నది. అతడికి ఇద్దరు కొడుకులు.

ఒకనాడు ఆమె గ్రామంలోని షావుకారు సాంబయ్య ఇంటికి వెళ్ళింది. కుశల ప్రశ్నలూ అవీ అయ్యాక ఆమె అతడికి తను వచ్చినపనేమిటో చెబుతూ, ''చూడు, బాబూ! నేను బాగా పెద్దదాన్నయి పోయాను. నా మనవరాలిని బాగా ఆస్తిపరుడింటి కోడలిని చేయాలన్నది నా ఆశ. ఎందుకంటే, ఏ పేదకుటుంబం వాళ్ళకో నా మనవరాలినిస్తే,

గుడిసేవ మురళీధర్



వాళ్ళు నా మనవరాలితో అడ్డమైన చాకిరీ చేయిస్తారు. అందువల్ల, నా కొడుక్కు మంచి స్నేహితుడైన నాగయ్య వున్న పట్నానికి వెళ్ళిరావాలనుకుంటున్నాను, దారి ఖర్చులకూ వాటికీ అవసరంగదా, రెండు వందలు అప్పుగా ఇవ్వగలవా?'' అని అడిగింది.

సాంబయ్యకు, పున్నమాంబ ఒకప్పుడు బాగా బతికిన కుటుంబీకురాలని తెలుసు. ఆ కారణంవల్ల, అతడు ఎంతో మర్యాదగా పున్నమాంబను, ''నాగయ్య కుటుంబంతో పెళ్ళి సంబంధమా? అతడు లక్షలు గడించాడని అందరూ చెప్పుకుంటారు!'' అని కాస్త ఆగి, ఈ చితికిపోయిన పున్నమాంబ మనవరాలిని అతడు కలలో కూడా తన కోడలుగా చేసుకోడనుకుంటూ, ''చూడు, పున్నమాంబా! నా వడ్డీ వ్యాపారం ఒకప్పటి లాగా లేదు. రైతు, కూలీజనం ఏదో గొంతు మీదికి వచ్చిందంటూ డబ్బు తీసుకోవడమే తప్ప, తిరిగి ఇచ్చేందుకు నానా యాతనా పెట్టేస్తున్నారు. ఏం అనుకోకు, నువ్వడిగిన మొత్తం ఇవ్వలేను,'' అని, పనివాడు తెచ్చిన పెసరట్లు తినబోతూ, పున్నమాంబకు కూడా ఇవ్వమని వాడికి సైగ చేశాడు.

''వద్దు బాబూ! ఈ పెసరట్లు నా తత్వానికి పడవు. వెళ్ళివస్తాను,'' అంటూ పున్నమాంబ ఇంటికి బయల్దేరింది.

ఆమెకు దారిలో, గ్రామంలో అందరికీ చిన్నాపెద్ద సహాయాలు చేసే భుజంగశాస్త్రి ఎదురుపడి, ''ఏమిటి, పున్నమ్మపిన్నీ! ఈ ఎండలో ఎక్కడికి వెళ్ళి వస్తున్నావు?'' అని అడిగాడు. పున్నమాంబ అతడికి సంగతి చెప్పి ఉస్సురుమన్నది. భుజంగశాస్త్రి, ఆమెతో ఆప్యాయంగా, ''పిన్నీ! మనవరాలి పెళ్ళి గురించి అట్టే బాధపడకు, మీది బతికిచెడ్డ కుటుంబం. ఆ సంగతి అందరికీ తెలుసు. మీ అబ్బాయీ నేనూ మంచి స్నేహితులం అని నీకు తెలిసిందేకదా? అతడు నాకెంతో సాయంచేశాడు. మిత్రుడి కూతురి పెళ్ళి చేయడంలో నాకూ బాధ్యత ఉంది. ఆ పట్నం నాగయ్యనేనెరిగినవాడే. డబ్బు దొరికినా, ఈ వయసులో అంత దూరాభారం నువ్వెళ్ళి రాలేవు. ఈ రోజే వెళ్ళి, ఆ నాగయ్యతో, నీ మనవరాలి పెళ్లి సంబంధం గురించి అన్నీ మాట్లాడి వస్తాను,'' అన్నాడు.

''అలాగే, నాయనా! నీ సాయం జన్మలో మరిచిపోను,'' అని ఇంటికి వెళ్ళిపోయింది పున్నమాంబ.

భుజంగశాస్త్రి, ఆరోజే బయల్దేరి పట్నం వెళ్ళి, నాగయ్యతో మాట్లాడి మర్నాటికల్లా

గ్రామానికి తిరిగివచ్చాడు. అతడు, పున్నమాంబ ఇంటికివెళ్ళి, తను నాగయ్యను కలుసున్నానని చెప్పి, "పిన్నీ! నాగయ్య అంతఆస్తిపరుడైనా, ఈనాటికీమీ కుటుంబం పట్ల ఎంతో ఆదరాభిమానాలున్నవాడు. అతడికి, నీ మనవరాలు లతను పెద్ద కొడుక్కు చేసుకోవడానికి ఎలాంటి అభ్యంతరమూ లేదు. కానీ, రాబోయే కోడలు వివేకవతీ, చురుకైనదీ అయివుండాలన్నది అతడి కోరిక," అంటూ వెంటతెచ్చిన బుట్టలోంచి ఒక వెండి చెంబును బయటికితీసి పక్కన పెడుతూ, "ఈ చెంబు సంగతి తర్వాత చెబుతాను. ముందు నీ మనవరాలు నాగయ్య అడిగిన రెండు ప్రశ్నలకు తృప్తికరమైన సమాధానాలు చెప్పాలి. ఆయన మాటల్లోనే అవేవంటే-తింటే గారెలేతినాలి, వింటే మహాభారతమే వినాలి, అంటారు మన వాళ్ళు. ఆ మహాభారతానికిగల మరొక పేరేమిటి? మనిషికి దేవుడు ప్రత్యక్షమై, కోరుకున్నప్పుడు మాత్రమే మరణం సంభవిస్తుందని వరమిస్తే, ఆ మనిషి ఎప్పటికైనా చావు కోరుకుంటాడా? ఇవీ నాగయ్య ప్రశ్నలు," అన్నాడు.

పున్నమాంబ, ఈ ప్రశ్నలు విని ఆశ్చర్యపోతూ తలుపు పక్కన నిలబడివున్న లతకేసి చూసింది. లత చిన్నగా నవ్వుతూ భుజంగశాస్త్రికేసి చూసి, "ఈ ప్రశ్నలకు జవాబు మరేంకష్టంకాదండీ. మన వేణుగోపాలస్వామివారి ఆలయంలో కథా కాలక్షేపం చేస్తూండే అవధానిగారు చెప్పగా లోగడ విన్నాను. మహాభారతానికి మరొక పేరు జయసంహిత లేదా జయగ్రంథం. ఇక



రెండవ ప్రశ్నకు-కోరుకున్నప్పుడు చావు కలిగేట్టట్లు వరం పొందినవాడు కూడా, ఏదో ఒకనాడు తప్పక చావుకోరుకుంటాడు. ఎందువల్లనంటే - దిగడానికి వీలుపడని బండిమీద ప్రయాణంలాంటిది కొంత కాలం తర్వాత ఎంత కష్టంగా ఉంటుందో, చావడానికి వీలుపడని జీవితం కూడా అంతే దుర్భరంగా వుంటుంది,'' అన్నది.

ఆ జవాబువిని భుజంగశాస్త్రి సంతోషంగా, ''బాగుబాగు, లతా! ఆ జవాబులు ఒక కాగితం మీద రాసి నాకివ్వు. ఇక ఇప్పుడు, ఈ వెండిచెంబు సంగతి. ఇందులో వున్న నేతిని రేపు సాయంకాలంలోగా వెన్నగా మార్చి ఇవ్వాలట!'' అన్నాడు.

ఇది వింటూనే, పున్నమాంబ ఆశ్చర్య పోతూ దిక్కులు చూసింది. లత మాత్రం ఏమీ తొణక్కుండా, ''శాస్త్రిగారూ, ఆ నెయ్యిని తప్పకుండా వెన్నగా మారుస్తాను. మీరు కాస్త వీలుచూసుకుని, రేపు సాయంత్రం రండి!'' అన్నది.

''ఈ ఇరవైఏళ్ళ లత నేతిని వెన్నగా మారుస్తుందా? ఆహా, అద్భుతం!'' అని మనసులో అనుకుంటూ, భుజంగశాస్త్రి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి శుద్ధ పెసరపప్పువండి, అందులో వెండి చెంబులోని నేతిలో కొంచెం ఖర్చు చేసి మిగిలిన నెయ్యితో రుచికరమైన అరిసెలు తయారుచేసి, వాటిని అమ్మి, ఆ డబ్బుతో తాజావెన్నకొని, చెంబులో పెట్టింది.

మర్నాడు భుజంగశాస్త్రి వచ్చాడు. పున్నమాంబ, అతడికి జరిగినదంతా చెప్పి, వెన్నవున్న చెంబును అతడి చేతికిచ్చింది. శాస్త్రి అబ్బురపడిపోతూ, ''ఆ గొప్పింటి కోడలివి కాగల లక్షణాలన్నీ నీలో వున్న మమ్మా!'' అంటూ లతను మెచ్చుకుని, పట్నం వెళ్ళి, నాగయ్య ప్రశ్నలకు సమాధానాలతో పాటు వెన్నవున్న చెంబును అతడికిచ్చాడు.

నాగయ్య పట్టరాని ఆనందంతో, ఇంత తెలివిగల అమ్మాయిని తనకు కోడలిగా కుదిర్చినందుకు భుజంగశాస్త్రిని ఒకటికి రెండుసార్లు మెచ్చుకుని, ఆ మర్నాడే సకుటుంబంగా పున్నమాంబ ఇంటికి వచ్చాడు.

లతకు నాగయ్య కొడుకూ, అతడికి లతా అన్నివిధాలా నచ్చడంతో, ఆ తర్వాత నెల తిరక్కుండానే వైభవంగా వాళ్ళిద్దరి వివాహం జరిగిపోయింది.



## అర్థవంతమైన మంత్రపూజలు

పూజలు, పెళ్ళిళ్ళు మొదలైనవి జరిగేప్పుడు పురోహితులు మంత్రాలు చెబుతారు. అయితే, చుట్టూ వున్నవారికి సాధారణంగా అవేవీ అర్థం కావు. వాటి అర్థాలు, ప్రాముఖ్యత గురించి తెలిసే అవకాశం కూడా లేదు. అయితే అన్ని రంగాలలోలాగే ఈ విషయంలోనూ ఎన్నో మార్పులు వస్తున్నాయి. ప్రతి వ్రతానికీ కేసెట్లు లభిస్తున్నాయి. ఒకప్పుడు ఎంతో గోప్యమనుకున్న మంత్రాలు అందరికీ తెలిసిపోతున్నాయి. అంతేకాదు; పూణేలో జ్ఞానప్రబోధిని అనే ఒక సంస్థ పురోహితులకు, అర్చకులకు శిక్షణనిస్తున్నది. వీరు మంత్రాలు చదవటంతో పాటు వాటి అర్థాలను, ప్రాముఖ్యతను విడమరచి చెబుతారు. ఈ సంస్థ కొన్ని పుస్తకాలను కూడా వెలువరించింది. వాటి సాయంతో మామూలు జనం కూడా శిక్షణ పొందిన పండితులతో కలిసి ఒకేసారి బృందగానంలా మంత్రాలను చదవవచ్చు. అలా చేయడం వల్ల గృహప్రవేశం, నామకరణం, పెళ్లి, యజ్ఞోపవీత ధారణ మొదలైన సందర్భాలలో పురోహితులతో కలిసి తాము మంత్రాలు పలకడం వల్ల సంపూర్ణ నిబద్ధత, తద్వారా సంపూర్ణ ఫలితాలు పొందవచ్చని చెబుతున్నారు. ఇది చాలామందిని ఆకర్షిస్తున్నది. డాక్టర్లు, ఇంజనీర్లు,లాయర్లుకూడా ఈ శిక్షణా తరగతులకు హాజరుకావడం విశేషం!

## అపూర్వ కృతజ్ఞతాభావం!

జేమ్స్ హారిసన్‌కు పదిహేనవ ఏట పెద్ద ప్రాణాపద వాటిల్లి రక్తం ఎక్కించవలసి వచ్చింది. ఇది జరిగి ఇప్పటికి యాభై ఒక్క సంవత్సరాలు అవుతున్నాయి. ఎవరో రక్తదానం చేయడం వల్లే తన ప్రాణం నిలిచింది గనక, ఆ కృతజ్ఞతా భావంతో తను కూడా రక్తదానం చేయాలని జేమ్స్ హారిసన్ సంకల్పించారు. ఆస్ట్రేలియా, న్యూ సౌత్ వేల్స్ స్టేట్‌లోని రెడ్ క్రాస్ సొసైటీకి 800 సార్లు వెళ్ళి మొత్తం 480 లీటర్ల రక్తం దానం చేశారు. దీనిని గొప్ప ప్రపంచ రికార్డుగా గిన్నిస్ బుక్ గుర్తించింది.



భౌగోళికంగానూ, సాంస్కృతికం గానూ వైవిధ్యం సంతరించుకున్న ఉత్తరప్రదేశ్, పురాణ కాలం నుంచే ప్రసిద్ధి గాంచిన భూమి. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు జన్మించిన పుణ్యభూమి. గౌతమ బుద్ధుడికీ, మహావీరుడికీ ఉత్తరప్రదేశ్‌తో సంబంధం ఉంది. సుప్రసిద్ధులైన అశోకచక్రవర్తి, హర్షుడు, మొగలు చక్రవర్తులు పరిపాలించిన ఘనచరిత్ర కలిగిన భూమి ఇది.

2,36,286 చ.కి.మీ. వైశాల్యం కలిగిన ఉత్తర ప్రదేశ్ మన దేశంలో నాల్గవ పెద్ద రాష్ట్రం. రాష్ట్ర జనాభా 16,60,52,859. తూర్పున బీహార్; దక్షిణంగా మధ్యప్రదేశ్; పడమర రాజస్థాన్, ఢిల్లీ, హిమాచల్ ప్రదేశ్; ఉత్తర దిశలో ఉత్తరాంచల్, నేపాల్, హర్యానా రాష్ట్రాలు సరిహద్దులుగా ఉన్నాయి.

పవిత్ర నదులుగా పేరుగాంచిన గంగా, యమునా నదులు ఈ రాష్ట్రం గుండా ప్రవహిస్తున్నాయి. ఇక్కడ ప్రవహించే మరికొన్ని నదులలో ముఖ్యమైనవి గోమతి, రాంగంగ, ఘఘురా. లక్నో రాష్ట్ర రాజధాని.

# అబ్దుల్లా - అల్లరి దయ్యాలు

సుల్తాన్‌పూర్ అనే గ్రామంలో అబ్దుల్లా అనే కుర్రవాడు నివసిస్తూండేవాడు. వాడి వయసు పన్నెండేళ్ళు. ఉంగరాలు తిరిగిన జుట్టుతో ఎప్పుడూ అందంగా నవ్వుతూ ఉండేవాడు. ఇరుగు పొరుగు ఇళ్ళవాళ్ళు ఏ పని చెప్పినా సంతోషంగా చేసేవాడు. ఎవరికి ఎలాంటి సాయం కావాలన్నా వెళ్ళి అందించేవాడు. అంగడికి వెళ్ళి సరుకులు కొనితెచ్చేవాడు. నీళ్ళు తెచ్చి పోసేవాడు. అబ్దుల్లా చేయని పని అంటూ లేదు. వాడు చేసే పనులకు సంతోషించి, పనులు



చేయించుకున్న వాళ్ళు చిల్లర డబ్బులు ఇచ్చేవారు.



కొన్నాళ్ళకు అలా పోగైన డబ్బుతో ఏం చెయ్యాలో అబ్దుల్లాకు తోచేది కాదు. ఆ తరవాత తినుబండారాలు కొని తినేవాడు. అయినా వాడి దగ్గర డబ్బులు మిగిలాయి. అందువల్ల వాటితో బొమ్మలు కొనడం మొదలు పెట్టాడు. మొదట చిన్న చిన్న బొమ్మలు, ఆటవస్తువులు కొనేవాడు. క్రమంగా పెద్ద పెద్ద బొమ్మలు, ఖరీదైన ఆట వస్తువులు కొని వాటితో ఆడుకోవటం ప్రారంభించాడు. కొన్నాళ్ళకు వాడి దగ్గర సైనికుల బొమ్మలు, ఏనుగుబొమ్మలు, గుర్రపుబొమ్మలు అంటూ చాలా బొమ్మలు చేరాయి.

ఆ బొమ్మలతో ఆడుకోవటం ఆరంభించాక, వాడికి ఇరుగు పొరుగు ఇళ్ళవారికి చేసే పనుల పట్ల ఆసక్తి తగ్గిపోయింది. కొన్నాళ్ళకు బొమ్మలే లోకంగా వాటితో ఆడుకుంటూ కాలం గడపసాగాడు. పనులు చేయడం మానేశాడు గనక, డబ్బులు రావడం కూడా ఆగిపోయింది. క్రమంగా చేతిలో వున్న డబ్బులు కూడా అయిపోవడంతో ఆఖరికి పస్తులతో గడపవలసిన దుస్థితి ఏర్పడింది.

అబ్దుల్లా, సలీం అనే మాంసం వ్యాపారి దగ్గరికి వెళ్ళి, ''బాబయ్యా, ఏదైనా పని వుంటే చెప్పండి, చేస్తాను. ఏ పనైనా ఫరవాలేదు. ఒక వారం రోజులుగా పని లేక, నిన్న రాత్రి నుంచి తిండి లేదు,'' అన్నాడు దీనంగా.

అబ్దుల్లా చేతిలో వున్న డబ్బుతో ఏం చేసిందీ, సలీంకు తెలుసు. డబ్బును అలా వృథాచేయడం అతనికి ఇష్టం లేదు. అబ్దుల్లా మాటలు మౌనంగా విని సమాధానం చెప్పకుండా, అతనికి తినటానికి ఆహారం పెట్టాడు. మిగిలిన ఇరుగుపొరుగు కూడా అబ్దుల్లాకు ఆకలి తీర్చుకోవటానికి ఇంత తిండి పెడుతూ వచ్చారు.

సంగతి తెలిసిన అబ్దుల్లా మామయ్య ఉమర్, ''నీకు డబ్బంటూ ఇవ్వను. అయితే, నీకు ఎప్పుడు ఆకలిగా ఉన్నా



# తాజ్‌మహల్ వెలసిన భూమి



అత్యంత సుందర భవనంగా ప్రపంచ ప్రసిద్ధి గాంచిన తాజ్‌మహల్ ఆగ్రాలో వుంది. పూర్తిగా చలవరాళ్ళతో నిర్మించబడిన అత్యద్భుత స్మారక భవనం తాజ్‌మహల్. ఇది ఏడు ఆధునిక ప్రపంచ అద్భుతాలలో ఒకటిగా పేరు గాంచింది.

షాజహాన్ చక్రవర్తి తన ప్రియతమ భార్య ముంతాజ్ స్మృతి చిహ్నంగా తాజ్‌మహల్ నిర్మించాడు. ముంతాజ్ భౌతికకాయాన్ని భూస్థాపితం చేసిన స్మారక భవనంగా ఇది నిర్మించబడింది. 1666లో షాజహాన్ మరణించినప్పుడు ఆయన భౌతిక కాయాన్ని కూడా ఇక్కడే సమాధి చేశారు.

యమునా నదీ తీరంలో వింత సొబగులు చిందే తాజ్‌మహల్‌ను పూర్తిగా తెల్ల చలవరాళ్ళతో నిర్మించారు. దాదాపు ఇరవై వేల మంది కార్మికులు ఇరవై రెండు సంవత్సరాలు నిర్విరామంగా శ్రమించి ఈ అద్భుత భవనాన్ని నిర్మించారు. 1648వ సంవత్సరంలో తాజ్‌మహల్ నిర్మాణం పూర్తయింది.

భవనంలోని ప్రతి అంశమూ దేనికదే ఎంతో అందంగా కనిపిస్తూ, భవనంతో కలిపి చూసినప్పుడు కూడా అందులోని ఇతర అంశాలతో ఒదిగిపోయి ఆకర్షణీయంగా మరింత అందంగా సమగ్రంగా కనిపించడం ఈ భవన నిర్మాణ శిల్పంలోని ప్రత్యేకతగా చెబుతారు.

గోమేధికం, సూర్యకాంతం వంటి మణులను ఉపయోగించి, పువ్వులు, నగిషీ రేఖల రూపకల్పనలలో భవనమంతా అలంకరించబడి వుంది. ప్రధాన ద్వార తోరణాలలో ఖురాన్ వాక్యాలను అందంగా చెక్కి, పుష్ప ఆకారాల అలంకారాలతో తీర్చిదిద్దారు.

మా ఇంటికి రా. ఉన్నది పెడతాం. మీ అత్తయ్యతో చెబుతాను,'' అన్నాడు.

అబ్దుల్లాకు ఏం చేయడానికీ తోచలేదు. తిండికేమోజరిగిపోతోంది. అయితే బొమ్మలు కొనటానికి డబ్బులెలా వస్తాయి? బొమ్మలు లేకుండా తానెలా ఆడుకోగలడు? బొమ్మలు కొనటానికి డబ్బులు కావాలి. దానికి ఏం చేయటానికైనా సిద్ధపడ్డాడు అబ్దుల్లా.

సుల్తాన్‌పూర్‌లో వున్న కొందరు అల్లరి పిల్లలు, అబ్దుల్లా పరిస్థితిని గమనించి వాణ్ణి ఆటపట్టించాలనుకున్నారు. వాళ్ళు అబ్దుల్లా దగ్గరికి వెళ్ళి, ''మన ఊరి చెరువు దగ్గర వున్న దయ్యాల మేడ గురించి నీకు తెలుసుకదా! నువ్వు ఒక్క రాత్రంతా అక్కడ గడపగలిగితే, నూరు రూపాయలు ఇస్తాం. రాత్రికి తినడానికి భోజనంకూడా ఇస్తాం. పందానికి సిద్ధమేనా?'' అని అడిగారు.

అబ్దుల్లా పరమానందపడిపోతూ, ఆహా డబ్బు, అనుకుంటూ, ''బొమ్మలు కొనడానికి కొంత డబ్బిచ్చారంటే, చాలు. కావా

లంటే నరకానికి వెళ్ళి రమ్మన్నా, వెళ్ళి వస్తాను,'' అన్నాడు బిగ్గరగా.

ఆ సాయంకాలం కుర్రవాళ్ళు, ఆహారాన్ని మూటకట్టి అబ్దుల్లా చేతికిచ్చారు. రాత్రంతా ఆ మేడలో గడిపి వస్తే ఇస్తామన్న వంద రూపాయలు చూపారు. ఆ తరవాత అతన్ని దయ్యాల మేడదగ్గర తెచ్చి వదిలి వెళ్ళారు.

అబ్దుల్లా మేడలోకి వెళ్ళి వెంట తెచ్చుకున్న బొమ్మలను తన చుట్టూ అమర్చుకున్నాడు. ఆ తరవాత వాటితో ఆడుకోవడం మొదలుపెట్టాడు. రాత్రయ్యేకొద్దీ ఆటలో నిమగ్నమైపోయి, పరిసరాలను సైతం మరిచిపోయాడు.

అర్ధరాత్రి సమయంలో మేడలో నాలుగు దయ్యాలు తచ్చాడసాగాయి. అవి అల్లరి దయ్యాలు. తమను చూసి భయపడేవాళ్ళంటే వాటికి మహాసరదా. పోటీపడి అల్లరి చేసేవి. అర్ధరాత్రి సమయంలో అవి భయంకరంగా మూలిగేవి. విషయం తెలియక ఆ భవంతిలో అడుగు పెట్టినవారు, ఆ మూలుగు విని భయంతో కేకలు పెడుతూ, వెంట తెచ్చినవాటిని కూడా అక్కడే వదిలేసి పారిపోయేవారు. దాన్ని చూసి దయ్యాలు వికవికా నవ్వుతూ, నాట్యం చేసేవి. ఆ దయ్యాలు, బొమ్మలతో ఆడుకుంటున్న అబ్దుల్లాను చూడగానే, పట్టరాని ఆనందంతో చేతులు చరుస్తూ వింత స్వరంతో అరిచాయి. ఆ శబ్దానికి ఆ కుర్రవాడు బెదిరి పారిపోగలడని అవి అనుకున్నాయి.

అయితే, అబ్దుల్లా వాటిని ఏమాత్రం పట్టించుకోకుండా బొమ్మలతో ఆడుకుంటున్నాడు. దానిని చూసి దయ్యాలు మొదట ఆశ్చర్యపడ్డాయి. ఆ తరవాత తమ వినోదానికి భంగం కలిగిస్తున్నాడని ఆ కుర్రవాడి మీద వాటికి కోపంవచ్చింది. అవి గెంతుతూ ముందుకు వచ్చాయి. అబ్దుల్లా స్తంభానికి ఆనుకుని కళ్ళు మూసుకుని కూర్చున్నాడు. అవి చుట్టూ గెంతుతూ తిరిగాయి. రకరకాల చేష్టలు చేశాయి.

ఒక దయ్యం వాడి దగ్గరికి వెళ్ళి కీచు కంఠంతో అరిచింది. అబ్దుల్లా కళ్ళు తెరి





## హస్తకళలు

ఉత్తరప్రదేశ్ హస్తకళలకు చాలా ప్రసిద్ధి గాంచింది. ఇక్కడి వెదురు అల్లికలు చాలా నాణ్యంగా ఉంటాయి. బుట్టలు, పళ్ళాలు, కుర్చీలు, టీపాయ్‌లు, కుడ్యఅలంకారాలు వెదురుతో అల్లుతారు. వెదురును రాఫియా అంటారు. నదీ తీరాలలో ఇది బాగా పెరుగుతుంది.

రాష్ట్రంలో ప్రసిద్ధి గాంచిన మరొక హస్తకళ లోహాలతో ఆభరణాలు చేయడం. ఉత్తర ప్రదేశ్‌లోని మొరాదాబాద్ 'మెటల్‌వర్క్'కు చాలాపేరుగాంచింది. రంగుల ఎనామెల్‌కు, సునిశితమైన నగిషీ పనులకు ఇది చాలా ప్రసిద్ధిగాంచింది.

వడ్రంగం, శిల్పం, లక్క నగలు, గాజులు, దంతపు చెక్కడాలు, బొమ్మల తయారీ మొదలైన వాటికి కూడా రాష్ట్రం ప్రసిద్ధి గాంచింది.

చాడే తప్ప దాన్ని పట్టించుకోలేదు. వాడేదో ధ్యానంలో వున్నట్టు దయ్యాలు భావించాయి. నిజానికి అబ్దుల్లా బొమ్మలతో ఆడుకోవడంలోనే నిమగ్నమై ఉన్నాడు.

కొంతసేపటికి అబ్దుల్లా ఆకలిగా ఉన్నట్టు గ్రహించాడు. తమ మిత్రులిచ్చిన మూట కోసం చీకట్లో వెతికాడు. అతని చేతికి పక్కనే వున్న భోజనం మూట తగిలింది. దానిని అందుకుంటూ, "ఆహా, బండముడి; నీ పని పడతాను మొదట!" అంటూ మూటను విప్పాడు.

మూటలో అతనికి అన్నం ముద్ద చేతిలోకి వచ్చింది. దానిని బయటకు తీసి, "నిన్ను ఆ వెన్నముద్దలాగా మింగేస్తాను," అన్నాడు. అది అయ్యాక అతని వేళ్ళకు ఉడికించిన కోడిగుడ్డు తగిలింది. దానిని తీసి ఆప్యాయంగా చూస్తూ, "బట్టతల! తరవాత నువ్వే!" అన్నాడు. చివరికి వాడి చేతికి గట్టిగా వున్న రొట్టెముక్క దొరకడంతో, "ఆహా! నువ్విక్కడున్నావా? గడుసు పిండం! నిన్ను కూడా వదిలేది లేదు!" అంటూ వాడు దానిని కూడా తినేశాడు. అయినా వాడి ఆకలి పూర్తిగా తీరలేదు. మిత్రులను మనసులో తిడుతూ గొణుక్కుంటూ అలాగే పడుకున్నాడు. కొంతసేపటికి అలాగే నిద్రపోయాడు.

అంతవరకు వాడి మాటలు విన్న దయ్యాలు ఇప్పుడు భయంతో గడగడలాడసాగాయి. అబ్దుల్లా నోట వెలువడిన మాటలూ, దయ్యాలపేర్లూ ఒకటిగా ఉండడమే దానికి కారణం. బండముడి, వెన్నముద్ద, బట్టతల, గడుసుపిండం – ఇవీ ఆ దయ్యాల పేర్లు. అబ్దుల్లా తమనే తింటానని చెప్పినట్టు అవి భ్రమపడ్డాయి. "వాడు మామూలు మనిషి కాదు. మన పేర్లతో సహా మనల్ని గురించి తెలుసుకుని ఉన్నా

డంటే మాటలా! అందుకే మనం ఇన్నాళ్ళు కొల్లగొట్టిన ధనాన్నిచ్చి వాణ్ణి మంచి చేసు కుందాం. అప్పుడైనా వదిలిపెడతాడేమో చూద్దాం,'' అన్నాయి దయ్యాలు ఒకదానితో ఒకటి.

ఆ తరవాత అవి భవనం లోపలి గదుల లోకి వెళ్ళి అక్కడ తాము సంవత్సరాల తరబడి దాచిన బంగారం, వెండి నగలను తెచ్చి వాడి ముందుంచి, ''అయ్యా, కరు ణించి వీటిని తీసుకుని మమ్మల్ని ప్రాణా లతో వదిలిపెట్టండి,'' అని వేడుకున్నాయి.

గాఢ నిద్రలో భోజనం గురించి కలలు కంటూన్న అబ్దుల్లాకు దయ్యం మాటలు వినిపించలేదు. వాడికి ఇంకా ఆకలిగా ఉంది. ఒక పక్క నుంచి మరో పక్కకు ఒత్తిగిలి పడుకుంటూ, ''ఊహు, వదిలి పెట్టను. నాకు చాలా ఆకలిగా వుంది. చేతికి దొరికిన వాటినల్లా తినేస్తాను,'' అన్నాడు నిద్రమత్తులో.

ఈ మాటలు వినగానే దయ్యాలు హడలిపోయాయి. అవి పాడుబడ్డ ఆ దయ్యాలమేడనుంచేకాకుండా, ఆ గ్రామం వదిలే పారిపోయాయి.

తెల్లవారాక నిద్రలేచిన అబ్దుల్లా చుట్టూ కలయజూశాడు. తన చుట్టూ విలువైన బంగారు, వెండి ఆభరణాలు మెరుస్తూ కనిపిం చాయి. రాత్రి ఏం జరిగిందో వాడికి తెలియలేదు. తను దయ్యాల మేడలో పడుకున్న సంగతి తెలుసు. అంతే. ఆదమరిచి నిద్రపోయాడు.

తను గత రాత్రి ఎంత అదృష్ట వంతుడిగా మారిందీ వాడు నెమ్మదిగా గ్రహించాడు. తనను కాపాడినందుకు దేవుడికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. నగలను తీసు కుని, ఉత్సాహంగా ఇంటి ముఖం పట్టాడు. ఆరోజు నుంచి బొమ్మలతో ఆడుకోవాలనే ఆసక్తి పూర్తిగా నశించింది. బాధ్యతలనెరిగిన వ్యక్తిగా మారాడు.

అబ్దుల్లాలో వచ్చిన మార్పును చూసి గ్రామస్థులు సంతోషించారు. సంవత్సరాలు గడిచాక అతడు మరింత మంచి పేరు తెచ్చుకున్నాడు. ప్రజలు అతణ్ణి గ్రామాధి కారిని చేయాలనుకున్నారు. అబ్దుల్లా వారి కోరికను కాదనలేదు. గ్రామాధికారిగానూ మంచి పేరు తెచ్చుకున్నాడు.





# పిశాచాల సంపద

గిరికోనగ్రామంలో నివసించే ప్రజలకు ఏదైనా పనిమీద పట్నం వెళ్ళాలంటే అడవి దారులు తప్ప మరొక రహదారి అంటూలేదు. వీరాస్వామి పనిమీద పట్నం వెళ్ళాడు. రెండు రోజుల్లోగాగాని పూర్తవదనుకున్న పని, వెళ్ళిన రోజు మధ్యాహ్నానికే అయిపోయింది. చీకటిపడేలోపల ఇంటికి చేరవచ్చు అనుకుంటూ, అతడు అడవిదారిన తిరుగు ప్రయాణమయ్యాడు.

ఐతే, వీరాస్వామి అడవి మధ్యలో వుండగా పెద్దపెట్టున వర్షం ఆరంభమైంది. అతడు వర్షం తగ్గాక తిరిగి నడవ ప్రారంభించేసరికి బాగా చీకటి పడిపోయింది. రకరకాల జంతువుల అరుపులు ప్రారంభమయ్యాయి. ఇకపై ప్రయాణం ప్రమాదమనుకుంటూ, అతడు దాపుల కనిపించిన ఒక శివాలయంలో రాత్రిగడిపేద్దామనుకున్నాడు. కానీ, గుడిని సమీపించబోయేంతలో పాములబుసలు వినిపించాయి. ప్రమాదాన్ని శంకించిన వీరాస్వామి, కాస్త ధైర్యాన్ని కూడగట్టుకుని దగ్గర్లో కనిపించిన ఒక మర్రిచెట్టు ఎక్కి కూర్చున్నాడు.

కొంతసేపటికి అతడికి చిన్నగా కునుకు పడుతూండగా, చెట్టుకింద పెద్దకోలాహలం వినిపించింది. వీరాస్వామి కళ్ళు తెరిచి దిగువకు చూశాడు. చెట్టుకింద నాలుగు పిశాచాలు కొలువుతీరివున్నాయి. కెవ్వుమనబోయి, అంతలో నిగ్రహించుకున్నాడు వీరాస్వామి.

నాయకపిశాచం కాబోలు అది చిన్న బండమీద కూర్చున్నది. మిగిలిన పిశాచాలు బుద్ధిగా దాని కాళ్ళదగ్గర గడ్డిలో కూర్చున్నాయి. నాయకపిశాచం, మిగతా పిశాచాలను, ''ఇప్పుడు మీరు ఒక్కొక్కరే సేకరించిన సంపదను విడివిడిగా చూపించండి!'' అని అడిగింది.

మొదటి పిశాచం తన దగ్గిర వున్న తోలు సంచీ మూతి విప్పింది. నాయకపిశాచం సంచీలోకిచూసి, తన పిల్లికళ్ళు మెరుస్తూండగా, ''అద్భుతం!'' అన్నది.

మాచిరాజు కామేశ్వరరావు

అలాగే రెండవపిశాచం మూడవ పిశాచం కూడా చూపాయి. వాటిని చూసిన నాలగవ పిశాచం, మిగిలినవాటితో, "మీరు నేచెప్పిన విధంగా పట్టుదలతో, గొప్ప సంపద సాధించితెచ్చారు! మాటనిలుపుకున్నారు. దాన్ని ఈ చెట్టు తొర్రలో దాయండి. రేపు రాత్రి మళ్ళీ ఇక్కడే కలుసుకుందాం!" అన్నది.

మూడు పిశాచాలూ, తమ నాయక పిశాచం చెప్పినట్టే సంచులను తొర్రలో దాచాయి. తర్వాత అన్నీ ఉత్సాహంగా గెంతుతూ అక్కడినుంచి దిక్కుకొకటి వెళ్ళిపోయాయి.

తెలతెలవారుతూండగా వీరాస్వామి చెట్టుపైనుంచి దిగి, పిశాచాలు తమ సంచులను దాచిన చెట్టుతొర్రకేసి ఒకసారి చూసి, "ఛీ, పిశాచాలూ వాటిసంపదా, శ్మశానం బూడిద!" అనుకుంటూ వేగంగా ఇల్లుచేరి, రాత్రి అడవిలో జరిగినదంతా భార్యకు వివరంగా చెప్పాడు.

ఆ సమయంలో, కందిపప్పు అరువు కోసం వచ్చిన పక్కింటి పాపాయమ్మ, గుమ్మంలో నిలబడి వీరాస్వామి, భార్యకు చెప్పినదంతా విన్నది.

ఆమె కందిపప్పుమాటమరిచి గిరుక్కున వెనుదిరిగి ఇంట్లోకిపోయి, తాను విన్నదంతా భర్త చెంగయ్యకు చెప్పి, "ఆ వీరాస్వామి భయస్థుడు, మందమతి! పెళ్ళయి పదేళ్ళయినా, నువ్వు చేయించిన ఈ ముష్టిరెండు గాజులతో తిరుగుతున్నాను. వెంటనే అడవికి బయలుదేరు. అక్కడ పాడుబడిన శివాలయం పక్కన మర్రిచెట్టు సంగతి వీరాస్వామి భార్యతో చెపుతూండగా విన్నాను.



దాని తొర్రలోవున్న పిశాచాల సంపద మూడు సంచులూ తీసుకురా. సంపద అంటే సంపదే! పిశాచాలకు ఒక సంపదా, మనుషులకు మరొక సంపదా ఉంటుందా ఏం, పిచ్చిగాని!" అన్నది.

భార్య మాటలు విన్నాక చెంగయ్యకు కూడా పిశాచాల సంపద దొంగిలించాలన్న బుద్ధిపుట్టింది. అతడు అడవికి పోయి చెట్టు తొర్రలోని మూడు సంచులూ తీసి చప్పున భుజానవేసుకుని, చీకటిపడుతూండగా ఇల్లు చేరాడు.

పాపాయమ్మ తలుపులన్నీ మూసి, ఆత్రంగా ఒక సంచి మూతివిప్పి, అందులోంచి బయట పడినదాన్నిచూసి కెవ్వుమన్నది. అది బాగాఎండిన మనిషి పుర్రె! రెండో సంచీనిండా ఎముకలు. మూడో సంచీ నిండా బూడిద!



''అక్కడే సంచుల్లో ఏమున్నదో చూడకుండా, ఈ దిక్కుమాలిన దరిద్రాన్ని ఇంటికి మోసుకువచ్చావు దేనికి? ఛీ,'' అంటూ భర్త మీద విరుచుకుపడింది పాపాయమ్మ.

చెంగయ్య, అంత కోపంలోవున్న భార్యకు ఏంచెప్పాలో తోచక ఊరుకున్నాడు. పాపాయమ్మ కొంతసేపు ఆలోచిస్తూ మౌనంగా వుండి, తర్వాత ఏదో నిజం గ్రహించిన దానిలా తలఊపుతూ, ''పిశాచాలు వీటిని సంపద అన్నాయంటే, ఇవి చాలా విలువైన వేనన్నమాట! రేపు రాత్రి వెళ్ళి మర్రికొమ్మల్లో నక్కి పిశాచాల మాటలు విను. డబ్బిస్తే వాటి సంపదను తిరిగి ఇస్తానని బేరంపెట్టు, తెలిసిందా?'' అన్నది.

పాపాయమ్మలాంటి పెళ్ళాంతో ఎంతో కాలంగా కాపరం చేస్తున్న చెంగయ్యకు, పిశాచాలతో బేరసారాలు నడపడానికి ఏమాత్రం భయం అనిపించలేదు. అతడు మర్నాడు చీకటిపడుతూనే తోలుసంచులు తీసుకుని అడవికివెళ్ళి, మర్రిచెట్టు కొమ్మల్లో కూర్చున్నాడు. అర్ధరాత్రివేళ పిశాచాలు వచ్చాయి. ఈసారి ఒక పిశాచం మాత్రమే తోలు సంచీని వెంటతెచ్చింది. అది ఆ సంచీని చెట్టుకున్న మరొక తొర్రలోదాచి, తాము రాత్రి సంచులుదాచిన తొర్రలో చేయిపెట్టి, అక్కడ సంచులులేకపోవడంతో, ''అహో, దోపిడి, నిలువుదోపిడి! మన సంపదనెవరో దోచుకుపోయారు,'' అంటూ కెవ్వుమన్నది.

నాయకపిశాచం చప్పునపోయి, తొర్రలో వెదికి చూసి, ''ఘోరం! మంత్రాలముని కొండణ్ణి, మనం బతికుండగా సాధించలేక పోయాం. వాడుచచ్చాకయినా, వాడి అవశేషాలు దొరకపుచ్చుకుని, ఈ చెట్టు సాక్షిగా ఆరడుగుల గోతిలో పాతేద్దామనుకుంటే, అదీ సాధ్యపడిందికాదు, హా!'' అంటూ తలపట్టుకుకూర్చున్నది.

ఇదే మంచి సమయం అనుకుంటూ చెంగయ్య చెట్టు మీదినుంచి దిగుతూ, ''అంతవిచారమెందుకు! డబ్బిస్తే, మీ సంపద మీకు తిరిగి ఇస్తాను,'' అన్నాడు.

తమతోలు సంచులు చెంగయ్య భుజాన వేలాడడం చూసిన పిశాచాలు ఆనందంగా, ''మా దగ్గర డబ్బులేదు. ఇప్పుడే తెచ్చిన సంచీడు నగలు మాత్రం వున్నాయి,'' అన్నవి.

''నగలా, మరీమంచిది! నా పెళ్ళాని కున్నది ఒకేఒకపిచ్చి, అది నగలపిచ్చి. ఎక్కడానగలసంచీ?'' అంటూ తను తెచ్చిన సంచులను అమిత ఉత్సాహంతో పిశాచాల ముందు పెట్టాడు.

అంతకు ముందు నగల సంచీతో వచ్చిన పిశాచం, ఆ సంచీని చెట్టుతొర్రలోంచి తీసి చెంగయ్యకిచ్చింది. చెంగయ్య సంచీమూతి విప్పి లోపలికిచూసి, ''ఆహా, ఎన్ని నగలు ఎన్నినగలు! నా పెళ్ళాం ఇక ఈ జన్మకు నగల కోసం నన్ను వేధించదు. వస్తా, వస్తా!'' అంటూ అక్కడినుంచి బయలుదేరాడు.

ఆసరికి అర్ధరాత్రి అయింది. చెంగయ్య గ్రామాన్ని సమీపిస్తూండగా ఇద్దరు రక్షకభటులు అతడికి తారసపడ్డారు. వాళ్ళు పట్నంలోని కొత్వాలు పంపగా, ఆ అడవిప్రాంతాల దొంగల కోసం గాలిస్తున్న రక్షకభటులు.

చిన్నగా కూనిరాగంతీస్తూ వస్తున్న చెంగయ్య, రక్షకభటుల కంటబడ్డాడు. వాళ్ళు పరుగుపరుగునపోయి చెంగయ్యను పట్టుకుని, అతడి సంచీలోవున్న బంగారు నగలుచూస్తూనే ఆశ్చర్యపోయి, ''ఏమిరా, నీ సాహసం! దొంగిలించిన నగలను, ఏదో కూరగాయల సంచీని భుజానవేసుకున్నట్టుగా మోసుకువస్తున్నావు. ఏ ఇంటికి కన్నం వేసి, ఈ నగలు దొంగిలించావు? ఇంటివాళ్ళనేమైనా హత్య చేశావా?'' అని అడిగారు.

చెంగయ్యకు భయంతో ముచ్చెమటలుపోసినై. కొద్దిసేపు మాట పెగలక చివరకు, ''పిశాచాల సంపద!'' అన్నాడు.

''అలాగా! నువ్వు పిశాచాల సంపదనే దొంగిలించావన్నమాట. ఆ సంగతేదో కొత్వాలు గారికే చెప్పుకుందువుగానిపద,'' అంటూ చెంగయ్యను, రక్షకభటులు పట్నంలాక్కుపోయి, కొత్వాలు ముందు నిలబెట్టారు.

కొత్వాలుకు, చెంగయ్య చెప్పిందేమీ అర్థంకాలేదు. వీడేదో మతిచెడినవాడనుకుని, అతణ్ణి జైల్లో వుంచమంటూ గిరికోన గ్రామాధికారికి కబురు పంపాడు. సంగతి తెలిసి పాపాయమ్మ లబోదిబో మంటూ గ్రామాధికారిని వెంటబెట్టుకుపోయి, అతడి సాయంతో నగలను ప్రభుత్వ ఖజానాకు చేర్పించి, చెంగయ్య నేరానికి జరిమానా కట్టి విడిపించుకున్నది.

గ్రామానికి తిరిగి వచ్చేదారిలో పాపాయమ్మ గ్రామాధికారితో, ''నాలోని అత్యాశే ఇన్ని కష్టాలకు కారణమయింది. అత్యాశ కూడా పిశాచాల సంపదలాంటిదే. అది పట్టుకుంటే ప్రమాదం తప్పదు సుమా!'' అంటూ చెంపలేసుకున్నది.



# మనదేశం గురించి తెలుసుకుందాం - క్విజ్



1. ఈ ఫోటోలో ఉన్న వ్యక్తిని గుర్తించగలరా? ప్రజాసేవ చేసినందుకు ఆయన 1997వ సం. లో ఒక అంతర్జాతీయ పురస్కారం అందుకున్నాడు. ఆ పురస్కారం పేరేమిటి?

2. స్థానికులైన మూండా తెగ గిరిజనులు మాట్లాడే భాషలో 'ప్రజల కోట' అని అర్థం వచ్చేలా ఒరిస్సాలో ఒక పట్టణం ఉన్నది. ఆ పట్టణం పేరేమిటి?

3. దక్షిణ భారతదేశానికి చెందిన ఏ వంశం 'దొరసముద్ర'ను రాజధానిగా చేసుకుని పరిపాలించింది?

4. శుభ కార్యాలకూ పండుగలకూ, ద్వారాలకు మావిడాకుల తోరణం కట్టడం హిందువుల సంప్రదాయం. ఏ దేవుడికి ప్రీతికలిగించడానికి ఇలా మావిడాకులు కడతారో తెలుసా?

5. పంజాబులోని ఒక కోట నుంచి బందా బహదూర్ శిక్కు రిపబ్లిక్‌ను లాంఛనంగా ప్రకటించాడు. ఏ కోటనుంచో తెలుసా?

6. బౌద్ధసన్యాసినులను ఏ పేరుతో పిలుస్తారు?

7. ఒక భారతీయ సుగంధ ద్రవ్యాన్ని పర్షియా (ఇప్పటి ఇరాన్)లో 'బుల్లిగోళ్ళు' అని పిలిచేవారు. ఏ సుగంధ ద్రవ్యాన్ని అలా పిలిచేవారు?

8. దక్షిణ భారతదేశంలో ద్రావిడ భాషల ఆవిర్భావానికి పూర్వం సంస్కృతశ్లోకాలను రాయడానికి ఏ లిపిని ఉపయోగించేవారు?

9. అర్జున అవార్డును గెలుచుకున్న తొలి క్రీడాకారుడు ఎవరు?

10. ఉప్పు సత్యాగ్రహం జరిగినప్పుడు గాంధీజీ నాయకత్వంలో దండియాత్ర జరిగింది. అదే సమయంలో దక్షిణ భారతదేశంలో తిరుచిరాపల్లి నుంచి వేదారణ్యానికి ఉప్పు పన్నును వ్యతిరేకిస్తూ ఒక యాత్ర జరిగింది. ఆ యాత్రకు నాయకత్వం వహించిన వారెవరు?

(సమాధానాలు వచ్చే నెలలో)

## నవంబర్ క్విజ్ సమాధానాలు

1. 1950-51
2. బ్రాహ్మి
3. గాంధీజీ
4. రవిదాస్
5. అండమాన్ & నికోబార్ దీవులు
6. బాలగంగాధర తిలక్
7. ఐదుసార్లు
8. మహారాష్ట్ర



# విఘ్నేశ్వరుడు

అక్క చెల్లెళ్ళు ప్రసన్నవదనా, మోహనా వరసగా విగ్రహాల్ని చూసుకుంటూ వెళ్ళి, నిరుత్సాహంగా మరలబోతూ, అవతల పిల్లల కోలాహలానికి ఆశ్చర్యంగా చూశారు.

''అక్కడ ఒక తక్కువ రకం రంగుల విగ్రహం ఉందిలెండి!'' అంటూ ఎవరో అనడం వాళ్ళకు వినిపించింది.

అది విని మోహన, ''పదవే, అక్కా! అదేదో తక్కువలోనే దొరుకుతుందిలా ఉంది!'' అంటూ ప్రసన్నవదన చేయి పుచ్చుకుని అటు దారితీసింది. అంతా ఆడా, మగా జనం ప్రదర్శనశాలలో ఒక్కరు మిగలకుండా వారిని వెంబడించారు.

ప్రసన్నవదన వెళ్ళి, వరహాల సంచిని విగ్రహం ముందు పెట్టి, తన మెడలోని పచ్చల రత్నాల హారాన్ని తీసి విచిత్రుడి చేతికి కంకణంలాగ చుట్టింది.

అది చూసి జనం, ''వీళ్ళకేదో పిచ్చి ఉంది! అలాంటి గొప్ప విగ్రహాల్ని కాదని ఇక్కడ డబ్బు ధారపోస్తున్నారు!'' అన్నారు.

ప్రసన్నవదన వాళ్ళతో, ''ఇక్కడున్న విగ్రహంలో ఏ విశేషాన్ని చూసి పిల్లలంతా మురిసి ముచ్చట పడుతున్నారో, ఆ విశేషమే మమ్మల్ని ముగ్ధుల్ని చేసింది. బాల దీవనలు బ్రహ్మ దీవనలు, పిల్లలు దైవ సమానులనీ అంటారు. అందుకే వారి ఎన్నికను శిరసావహించాము,'' అన్నది.

''మట్టి శిల్పంలో లేని రూపసౌందర్యాన్ని, సొంపుల్ని సామాన్యమైన జేగురు, సున్నము, బొగ్గు మొదలైన రంగులతోనే ఎంతో మూర్తివంతంగా తీర్చిదిద్దిన చిత్రకారుని ప్రతిభ అమోఘంగా ఉంది. మా బహూకరణం అతి స్వల్పం!'' అని మోహన అన్నది.



ఆ సమయంలో, విచిత్రుడి వృద్ధ జననీ జనకులు అక్కడికి వచ్చారు.

"నాయనా, పావనా! వాతాపి గణేశుడి కృప వల్ల మా అన్వేషణ ఫలించింది, ఇంత వాడివై కనిపించావు!" అంటూ కుమారుణ్ణి కౌగిలించుకుని ఆనందబాష్పాలు రాల్చారు. అప్పుడు విచిత్రుడు బాల్యం దాటుతున్న నవయువకుడు. తల్లిదండ్రులను చూసి మహదానందం పడ్డాడు. గతం అంతా గుర్తుకొచ్చింది. తన పేరేమిటో తెలిసింది. వారి సమాగమాన్ని చూసి, ప్రసన్నవదన తృప్తిపడుతూ, "ఇప్పుడిప్పుడే మా కోరిక నెరవేరింది, మా మొక్కు చెల్లించుకుం టాము," అని చెప్పింది.

క్షణాల మీద జనం అక్కడ పెద్ద పందిరి వేశారు. విశాలమైన వేదిక అమర్చారు.

ప్రసన్నవదన వినాయక విగ్రహాన్ని అంటి పెట్టుకు కూర్చుని తాళాలు వాయిస్తూ, "తాండవ నృత్యకరీ గజానన..." అని కీర్తన మొదలుపెట్టింది. వేదికపై మోహన విద్యుల్ల తలాగా నృత్యం చేస్తూంటే, జనం పరవశించి పోతూ ఆనందతరంగాల్లో ఊగిపోతున్నారు.

ప్రసన్నవదన గానం గజానన పండితు డికి వినిపించింది!

అప్పుడు గజాననుడు శతాధిక వృద్ధుడై ఇల్లు కదలలేని స్థితిలో ఉన్నాడు. అతనికి ఎక్కడలేని జవసత్వాలు వచ్చాయి. పరుగు లాంటి నడకతో పందిట్లోకి చేరుతూనే ప్రసన్న వదనను చూసి చేతులెత్తి జోడించి సాగిల పడి అలాగే కదలా మెదలక ధ్యానముద్రలో ఉండిపోయాడు.

నృత్యం చేస్తూ, చేస్తూ మోహన పెద్దదైన వినాయక విగ్రహాన్ని అవలీలగా భుజాని కెత్తుకుంది. అది చూసి తెప్పరిల్లిన జనం, "అంత బరువు మోయలేవమ్మా!" అని అంటూంటే మోహన, "నాకు అలవాటేగా!" అని చెప్తూ విగ్రహాన్ని, భుజాన మోస్తూ, నాట్యంచేస్తూన్న నడకతో బయలుదేరింది. జనం అంతా ఆమె వెనకనే వెళ్ళారు. ఆ సందట్లో ఎప్పుడో అదృశ్యమైన ప్రసన్న వదన సంగతే ఎవరికీ పట్టలేదు.

ధ్యానముద్ర నుండి గజాననుడు కళ్ళు తెరిచాడు. ఎదురుగా విగ్రహమున్నచోట మెరుస్తున్న వరహాలతో నిండుగా ఉన్న బంగారు జలతారు సంచి కనిపించింది. పాదాలచెంత విచిత్రుడు మోకరిల్లి కూర్చుని ఉన్నాడు.

గజాననుడు విచిత్రుడితో, "ఆలయ మంటప కుడ్యాలను గణేశ లీలల చిత్ర శోభితం చెయ్యి! అందుకు కావలసిన

ధనాన్ని ప్రసన్నవదనుడైన విఘ్నేశ్వరుడే ఆనందంగా అందించాడు గదా!'' అంటూ లేచాడు.

గజానన విచిత్రులిద్దరూ ఊరేగింపుగా వెళ్తున్న జనంతో కలిశారు.

మోహన విగ్రహంతో ఆలయ పుష్కరిణికి చేరుకుని తటాక సోపానాలు దిగుతూ మాయమై, ఆమెకు మారుగా చిట్టెలుక విగ్రహాన్ని వీపున మోస్తూ నీటిలోకి పరుగు తీసింది. ఆ రోజే విగ్రహాల్ని జల నిమర్జనం చేసే ఉత్సవ దినం.

విగ్రహం తటాక మధ్యానికి చేరుకుని, కోటి పూర్ణిమల కాంతిపుంజంగా భాసించింది. ఆ కాంతిలో అభయహస్తంతో ఆశీర్వదిస్తూ విఘ్నేశ్వరుడు లీలగా కనిపించి, అంతర్థానమయ్యాడు.

గజాననుడు విచిత్రుణ్ణి గాఢాలింగనం చేసుకుని, ''నాయనా,పావనా!నీ మూలంగా వాతాపి నగరానికి పావనత మిశ్రమమైంది. నీవు పావన మిశ్రుడివి!'' అని చెప్పాడు, అంటూ పావనమిశ్రుడు ఆగకుండా, ''గర్భాలయ ముఖద్వారం మీది చిత్తరువు మహాభారత రచన...'' అంటూ చెప్పబోతుంటే, యువ చిత్రకారుడు, ''గురుదేవా!'' అంటూ పావనమిశ్రుడి పాదాలను చేతులతో చుట్టి, ''మీ పావన చరిత్రను విన్న నేను ధన్యుణ్ణి! నా పేరు ఆనందుడు. మీ పావన నామాక్షరి మొదటి రెండు అక్షరాల్ని మార్చి, నా పేరు ముందు చేర్చి, 'వపానందుడు' అనిపించుకుంటాను. ఈ మంటపం పావనచిత్రాలయం! ఈ చిత్రాలకు ప్రతికృతులు రచిస్తాను. ముందుతరం





వారికి మీరు చెప్పిన కథలన్నీ చెప్తాను. అనుగ్రహించండి!'' అంటూ భక్తితో శిరస్సు వంచాడు.

మెరుస్తున్న వెండి జుట్టుతో, ముడతలు పడ్డ విశాల ఫాలంతో వార్ధక్యం పైబడ్డా, మనసుకు ముసలితనం రానివ్వని పావనమిశ్రుడు యువకుడి తలపై చేత్తో ఆశీర్వదిస్తూ, మందహాసం చేసి మళ్ళీ చెప్పసాగాడు :

వ్యాసుడు తాను చెప్పబోయే మహాభారతాన్ని వ్రాయగల సమర్థుడు ఎవరా అని ఆలోచిస్తూండగా, బ్రహ్మ సాక్షాత్కరించి, విఘ్నేశ్వరుణ్ణి లేఖకుడిగా పెట్టుకోమన్నాడు. బ్రహ్మ ఆదేశానుసారం వ్యాసుడు విఘ్నేశ్వరుణ్ణి ప్రార్థించాడు.

విఘ్నేశ్వరుడు ప్రసన్నుడై, ''వ్యాసా! నీ ధోరణిలో నీవు చెప్పుకుపోతూండాలి, నా వంక చూడకూడదు సుమీ!'' అని చెప్పి వ్రాతకు కూర్చున్నాడు.

విఘ్నేశ్వరుడు తన దంతం ముక్కనే గంటంగా పట్టి, మోపినది ఎత్తకుండా వ్రాస్తున్నాడు. వ్యాసుడు అరమోడ్పు కన్నులతో ధ్యానమగ్నుడై చెప్తున్నాడు.

ఎదురుగా హిమాలయ శిఖరాగ్రం నుంచి పడుతున్న జలపాతం మధ్యమావతి రాగంలాగా మంద్ర గంభీరంగా నేపథ్య సంగీతం లాగా శృతి పోస్తున్నది. దేవదారు వనాలు తలలూపుతూన్నవి. జలజల పారే నదాలు అనంత రాగమాలికలు ఆలపిస్తున్నవి. మహాభారతరచన ధారావాహికంగా, నిర్విరామంగా సాగుతూన్నది.

పుట్టు గ్రుడ్డి, ధృతరాష్ట్రుడు హస్తినాపుర సింహాసనాన్ని అలంకరించాడు. తమ్ముడు పాండురాజు సామ్రాజ్యభారాన్ని మోస్తూ విస్తరింపజేశాడు. పాండురాజుకు పంచపాండవులూ, ధృతరాష్ట్రుడికి నూరుగురు కౌరవులూ పుట్టారు.

చిన్ననాటి నుంచే కౌరవ పాండవుల మధ్య స్పర్థ, అసూయలు వర్థిల్లాయి.

వ్యాసుడు చెప్తున్నాడు విఘ్నేశ్వరుడు వ్రాస్తున్నాడు. సభాపర్వం సాగుతున్నది.

మయసభలో పరాభవం పొందిన దుర్యోధనుడు ప్రతీకారంగా పాండవుల్నీ వారి భార్య ద్రౌపదినీ జూదంలో గెల్చుకుని ద్రౌపదీ వస్త్రాపహరణ తలపెట్టాడు. భీముడు దుర్యోధనుడి రక్తం తాగుతానని సింహగర్జన చేశాడు.

పాండవులు వనవాసం చేశారు. విరాటరాజు కొలువులో అజ్ఞాతవాసం చేస్తున్నారు, సైరంధ్రిగా ఉన్న ద్రౌపదిని కీచకుడు అవమానించి భీముడి చేతిలో ముద్ద

య్యాడు. ఉత్తర గోగ్రహణంలో బృహన్నల విజయుడయ్యాడు. మహాభారతంలో సుందరకాండగా విరాటపర్వం సాగింది.

జలపాతం కళ్యాణిరాగం ధ్వనిస్తున్నది.

అభిమన్యుడికి ఉత్తరకు వివాహం జరిగింది. కృష్ణుడు రాయబారం వెళ్ళి పాండవులకు ఐదు ఊళ్ళు ఇస్తే చాలన్నాడు. దుర్యోధనుడు సూది మొనపాటి నేల కూడా ఇవ్వనన్నాడు.

యుద్ధం అనివార్యమైంది. హిమాలయ ఝరి కదన కుతూహల రాగం ఆలపిస్తూ శిఖరాలు విరిగి పడుతున్నవా అన్నట్లుగా పడి హెచ్చిపడుతూన్నది. హిమానీ నదాలు గుర్రాల్లా దౌడు తీస్తున్నాయి.

కృష్ణుడు అర్జునుడి రథసారధి అయ్యాడు. అర్జునుడికి భగవద్గీతను ఉపదేశిస్తున్నాడు. జలపాతం సామసౌరాష్ట్ర దేవగాంధార రాగాలను వినిపిస్తున్నది.

భీష్ముడు అంపశయ్య చేరాడు. ద్రోణుడు పద్మవ్యూహం పన్నాడు. అభిమన్యుణ్ణి పదిమందీ కలిస్తేనేగానీ చంపలేక పోయారు. సుభద్ర పుత్రశోకం లాగ జలపాతధ్వని ముఖారి రాగంగా వినిపిస్తున్నది.

అర్జునుడు విజృంభించాడు. ద్రోణుడి తల ద్రుష్టద్యుమ్నుడు నరికాడు. అనేక అనర్థాలు సంతరించుకున్న కర్ణుడిని నమ్ముకున్న దుర్యోధనుడు కర్ణుడి చావుతో చిత్తయ్యాడు. భీముడు దుశ్శాసనుణ్ణి చంపాడు. దుర్యోధనుడి తొడలు విరగ్గొట్టాడు.

జూదంలో ఓడిపోయిన ధర్మరాజు తమ్ములతో యుద్ధంలో విజయదుందుభి మ్రోగించాడు.



కృష్ణుడు అవతారం చాలించాడు.

పరీక్షిత్తుకు పట్టంకట్టి పాండవులు ద్రౌపదితో మహాప్రస్థానం బయలుదేరారు.

ధర్మానికి చావు లేదు, చివరకు నిలబడేది ధర్మమొక్కటే అన్నట్లుగా ధర్మరాజు మేరు శిఖరాగ్రం మీద నిలబడ్డాడు.

జలపాత ధ్వని క్షీణిస్తూన్నది. అంతటా గంభీర నిశ్శబ్దం ఆవరించుకున్నది. వ్యాసుడు చెప్పింది విఘ్నేశ్వరుడు వ్రాస్తున్నాడా? లేక విఘ్నేశ్వరుడు వ్రాసింది వ్యాసుడు చెపుతున్నాడా? అన్నట్లు చకచకా భారత రచన సాగింది. సత్యలోకంలో పద్మాసనంపై బ్రహ్మ సంతృప్తిగా చిరునవ్వు చిందిస్తూ, సాభిప్రాయంగా సరస్వతి వంక చూశాడు. వెంటనే సరస్వతీ దేవి వీణ మీటుతూ శ్రీరాగాన్ని పలికించింది.

మహాభారతం చెప్పడం పూర్తి కావస్తున్నది. చివరి పర్వంలో వున్నది.

సరస్వతీదేవి సత్యలోకం నుంచి మంగళా చరణంగా శ్రీరాగం ఆలాపిస్తున్న వీణా నాదం, తాను చెప్పుతున్న కథనానికి అంత రాయంగా వ్యాసుడి చెవిని సోకింది.

ఇంకా చెప్పవలసినది చాలా ఉంది. వ్యాసుడు ఆదమరుపుగా లేఖకుడి దెసతేరి చూశాడు. మరుక్షణంలో విఘ్నేశ్వరుడు అంతర్ధానమయ్యాడు.

మహాభారత గ్రంథం మీద ఆకాశం నుండి అక్షింతల్లాగ పువ్వులు జలజలా రాలాయి. వ్యాసుడు ఆత్రంగా గ్రంథాన్ని విప్పి పరిశీలనగా చూశాడు. తాను ఇంకా చెప్పదలచినదంతా ఒక్కఅక్షరం తేడా లేకుండా సంపూర్ణంగా వ్రాయబడి ఉంది. వ్యాసుడు ఆనందాశ్చర్యాలతో పులకించి పోతూండగా, మహతి వీణపై హంసధ్వని రాగం వినిపించింది.

నారదుడు వస్తూనే, ''ఏమిటి మహాభారత మహర్షీ! ఆశ్చర్యపడిపోతూ చూసుకుంటున్నావు?'' అన్నాడు.

వ్యాసుడు జరిగినది చెప్పాడు.

''అంటే, నీవు చెప్పేది చెప్పకుండానే ముందుగానే నీ లేఖకుడు వ్రాసుకుంటూ వచ్చాడన్న మాట!'' అన్నాడు నారదుడు మందహాసం చేస్తూ.

''ఔను, నారదా! అదే జరిగింది. అటువంటి లేఖకుడు ఎలాంటి తపస్సులు చేసినా ఎవరికీ లభించడు కదా! నేను ధన్యుణ్ణి! నా సంకల్పం జయప్రదమైంది. మహాభారతాన్ని 'జయం' అని కూడా పేర్కొంటున్నాను!'' అనిచెప్తూ వ్యాసుడు చేతులు జోడించి విఘ్నేశ్వరుణ్ణి భక్తితో ధ్యానించాడు.

మహాభారతం దగ్గర పెద్ద జ్యోతి పెరుగుతూ కనిపించింది.

ఆ జ్యోతి విఘ్నేశ్వరుడి ఆకారంగా రూపొందింది. విఘ్నేశ్వరుడు సాక్షాత్కరించి, ''వ్యాసమహర్షీ! నీ మహాభారతం అద్వితీయ మహాకావ్యమై పంచమవేదంగా పరిగణింపబడుతూ కీర్తింపబడుతుంది!'' అని, వ్యాసుణ్ణి ఆశీర్వదిస్తూ అంతర్హితుడయ్యాడు.

విఘ్నేశ్వరుడిచేత అతని దంతపు గంటంతో లిఖింపబడి అక్షరసిద్ధి పొందిన మహాభారతం అన్ని కాలాల్లో సారస్వతాకాశంలో మిలమిల మెరిసే చుక్కల్లో చందమామగా నిలిచింది. - (సమాప్తం)





# రక్తసంబంధం

బొబ్బర్లంక అనే గ్రామంలో, బాలయ్య అనే పేద యువకుడొకడుండేవాడు. వాడికి నా అనేవాళ్ళెవరూ లేరు. అందుచేత వాడు గ్రామంలో కూలీనాలీ చేసుకుంటూ, పూట కూళ్ళ ఇంట్లో భోజనం చేస్తూ, ఏ చెట్టు నీడనో, అరుగుమీదనో నిద్రపోతుండేవాడు. వాడలా ఒక రోజున నాంచారమ్మ గుడి అరుగు మీద రాత్రి నిద్ర పట్టక అటూ ఇటూ దొర్లుతున్నాడు. ఆ సమయంలో ఒక యువతి వచ్చి, బాలయ్య పడుకున్న అరుగుకు కాస్త దూరంలో వున్న మరొక అరుగు మీద కూర్చుని, చిన్న మూటొకటి విప్పి, అందులో వున్నవేవో ఆదరా బాదరా తినసాగింది.

బాలయ్య ఆమెను చూసి, ముందు ఏదైనా పిశాచమా అని భయపడి కళ్ళు మూసుకుని, అంతలోనే కాస్త ధైర్యం తెచ్చుకుని, ''ఎవరు నువ్వు?'' అంటూ ప్రశ్నించాడు.

ఆ యువతి, ఆ ప్రశ్న వింటూనే ఉలిక్కి పడి, ''నేను కూర్మయ్య కూతుర్ని,'' అన్నది.

''అది సరే, ఇంత అర్ధరాత్రి వేళ ఇక్కడి కెందుకొచ్చినట్టు?'' అన్నాడు బాలయ్య కొంచెం తీవ్ర స్వరంతో.

యువతి కాస్త తటపటాయించి, ''నువ్వీ గ్రామం వాడివో కాదో తెలియదు. మా అమ్మ పోయాక, మా నాన్న రెండోపెళ్ళి చేసుకున్నాడు. మా పిన్ని గయ్యాళిది. తిండి సరిగా పెట్టదు; కానీ ఇంటెడు చాకిరీ చేయిస్తుంది. ఇవాళ మా నాన్నా, పిన్నీ పొరుగూరు వెళ్ళారు. పిన్ని ఏ క్షణాన తిరిగి వస్తుందో అన్న భయంతో, పోయిన పండక్కి చేసిన అరిశెలు తెచ్చుకుని తింటున్నాను,'' అన్నది.

ఆ జవాబుకు బాలయ్య నవ్వి, ''పాత్రలో దాచిన అరిశెలులెక్క చూసుకుని, నీ పిన్ని నీ దొంగతనం చులాగ్గా గ్రహిస్తుంది. అప్పుడు నీకు దెబ్బలు తప్పవు గదా!'' అన్నాడు.

''అదంతా తరవాతి మాట. ముందు రుచిగా ఉన్న అరిశెలు తినేస్తాను,'' అన్నది యువతి.

డా. జొన్నలగడ్డ మార్కండేయులు



బాలయ్య, ఆమెకేసి జాలిగా చూసి, ''మీ నాన్న కూర్మయ్య దూరపు వరసన నాకు మేనమామ అవుతాడు. మా అమ్మా, నాన్నా పోయినప్పుడు నా వయసు పదేళ్ళు. నీ వయసు ఐదో ఆరో అయివుంటుంది. అప్పుడు నేను మీ ఇంట్లోనే, మామయ్య ఆదరణలో ఉన్నాను. మీ పిన్ని నా మీద ఒకటికి రెండు సార్లు దొంగతనాలు అంటగట్టి, మీ నాన్న చేత చావ చితక కొట్టించింది. నేను ఇల్లొదిలి, ఎవరింత ముద్ద పెడితే వాళ్ళింట చాకిరీ చేస్తూ పెరిగి, ఇప్పుడు కూలి పనులు చేసుకుంటూ బతుకుతున్నాను. అవునూ, అన్నట్టు నీ పేరు సునీత గదా?'' అని అడిగాడు.

''అవును!'' అంటూ ఆ యువతి బాలయ్య కేసి ఒక్క క్షణ కాలం పరిశీలనగా చూసి వెళ్ళిపోయింది.

సునీత వెళ్ళిపోయాక బాలయ్యకు రకరకాల ఆలోచనలు వచ్చినై. తన తల్లీ తండ్రీ బతికుండగా, వాళ్ళు సునీతను తన పెళ్ళాం అనడం, దానికి అత్తయ్యా, కూర్మయ్యా నవ్వుతూండడం వాడికి గుర్తున్నది. ఈ కొత్త అత్తయ్య వచ్చి, పెళ్ళీడు వచ్చిన సవతి కూతుర్ని నానా కష్టాల పాలు చేస్తున్నది. ఇప్పుడు తను వెళ్ళి, ఆ సునీతను తనకిచ్చి పెళ్ళి చెయ్యమనీ, వాళ్ళకున్న ఐదెకరాల పొలం పనులూ, ఇంటిపనులూ నేర్పుగా చేస్తూ, వయసు మీద పడుతున్న అత్త మామలకు కావలసినంత విశ్రాంతి కలిగిస్తానని చెపితే ఎలా ఉంటుంది?

బాలయ్య ఇలా ఆలోచించుకుని, ఒక నిర్ణయానికి వచ్చి, తెల్లవారాక కూర్మయ్య ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో కూర్మయ్య ఇంటి అరుగు మీద కూర్చుని ఉన్నాడు. అతడి భార్య శాంతమ్మ దూరంగా గడప వార కూర్చుని ఏవో కాయగూరలు తరుగుతున్నది.

కూర్మయ్య తనను సమీపిస్తున్న బాలయ్యను చూసి చిరునవ్వు నవ్వి, అంతలోనే కాస్త కటువుగా, ''ఏరా, ఇటొచ్చావు? ఏమైనా పని వుంటే వీధిలో మాట్లాడవచ్చు గదా!'' అన్నాడు.

దానికి బాలయ్య నిబ్బరంగా, ''మామయ్యా! నాకెవరూ లేరు. నీకు సునీత తప్ప మరెవరూ చెప్పుకోతగ్గ ఆప్తులు లేరు. ఆ రోజుల్లో నా చిన్నతనంలో అనుకున్నట్టుగా సునీతను నాకిచ్చి చెయ్యి. పొలం బాధ్యతా, ఇంటి బాధ్యతా తీసుకుని, నీకూ,

అత్తయ్యకూ అన్ని విధాలా సంతోషం కలిగిస్తాను,'' అన్నాడు.

ఆ మాటలకు కూర్మయ్య బిత్తరపోయి, బాలయ్యకేసి పరీక్షగా చూస్తూ ఒక క్షణం ఆగి, "ఒరే, బాలూ, అవన్నీ ఏనాటి మాటలు! నీ అమ్మా నాన్నలు పోయినప్పుడు, నిన్ను ఇంట్లో ఉంచుకుని ప్రయోజకుణ్ణి చేయాలనుకున్నాను. కానీ, నీ పిన్నత్త మనసులో నువ్వు దొంగగా ముద్ర పడ్డావు. ఆమెను కాదని నేను స్వతంత్రించి ఏ పనీ చెయ్యలేను,'' అన్నాడు.



గడప పక్కన కూర్చుని ఈ సంభాషణ విన్న శాంతమ్మ చరచరా లేచి బయటికి వచ్చి, "ఒరే, నువ్వు తాడూ బొంగరం లేనివాడివి, దొంగవు. మా కుటుంబం మీద లేని అభిమానం నటించకు. సునీతను ఎవరికిచ్చి పెళ్ళి చేయాలో, దాని తల్లిదండ్రులకు తెలుసు. పిల్లనియ్యమంటూ మరొకసారి, నా గుమ్మంలోకి వచ్చావో, మర్యాద దక్కదు. కాళ్ళు విరగ్గొడతాను! పో ఇక్కణ్ణుంచి!'' అంటూ ఆవేశంతో ఊగిపోయి కళ్ళు తిరిగి దభీమంటూ కిందపడిపోయింది.

కూర్మయ్య, పినతల్లి కేకలు విని పెరట్లో బావి దగ్గర బట్టలుతుకుతున్న సునీత, ఆమెను సమీపించి ఏమి చేయడమా అని కంగారు పడుతుంటే, బాలయ్య పరుగు పరుగునపోయి, వైద్యుడు వీరభద్రాచారిని తీసుకువచ్చాడు. ఆయన చాలా సేపు తంటాలు పడి, ఆ పసరూ ఈ పసరూ శాంతమ్మ నోటిలో, ముక్కుల్లో పోసి తెలివి తెప్పించి, "చూడు, శాంతమ్మా! లోగడ చెప్పాను, నీకు రక్తపుపోటు ఎక్కువని. ఐనా, నువ్వు అయినదానికీ కానిదానికీ తెగ ఉద్రేకపడి పోతున్నావు. హఠాత్తుగా ఏ గుండెపోటో వచ్చి నువ్వు శివశివా అంటూ మరోలోకానికి ప్రయాణం కట్టకుండా ఉండాలంటే-నువ్వు ఎంతలేదన్నా మూణ్ణెల్ల పాటు మంచం దిగకుండా విశ్రాంతి తీసుకోవాలి. దానితో పాటు, ఉదయం, సాయంకాలాలు సర్పగంధి తీగల ఆకులను, అవి ఏమాత్రం వాడిపోక ముందే నూరి రసం తీసి కాళ్ళకూ, చేతులకూ, గుండెకూ మర్దన చెయ్యాలి. సర్పగంధి తీగ మన గ్రామానికి దక్షిణంగా వున్న కోటప్పకొండ మీద కావలసినంత దొరుకుతుంది. అది రోజూ తెప్పించుకుని రసం తీయించే ఏర్పాటు చేసుకో. అన్నిటికన్నా ముఖ్యంగా ఇకమీదట

ఆవేశాన్నీ బాగా అదుపులో వుంచుకో,'' అన్నాడు.

వీరభద్రాచారి వెళ్ళిపోయాక, కాళ్ళూ చేతులూ వణుకుతుండగా శాంతమ్మ ఆర్చుకుపోయిన గొంతుతో సునీతకేసి చూస్తూ కళ్ళనీళ్ళు పెట్టుకుని, ''ఇప్పుడు నేనేదో గోసాయీ, బైరాగి వాళ్ళ తత్వాలు మాట్లాడుతున్నానని అనుకోకు, సునీతా! ఆరోగ్యంగా వున్నంత వరకూ మనిషి, తోటి మనిషి అవసరాన్ని ఏమాత్రం గుర్తించడు. ప్రేమగా పెంచవలసిన నిన్ను సవతి తల్లిగా ఇన్నేళ్ళు చెప్పరాని బాధలు పెట్టాను. ఆ పాపమే నన్నిప్పుడు ఇలా పట్టి పీడించబోతున్నది. నన్ను బాగా చూసుకోమని ఇప్పుడు నిన్నెలా అడగ్గలను!'' అన్నది.

ఆ మాటలకు సునీత చలించిపోయి, ''పిన్నీ! నువ్వు కొట్టినా, తిట్టినా - అప్పుడప్పుడూ నీ మీద కోపం వచ్చినా, నిన్ను అమ్మగానే అనుకున్నాను. నీవు త్వరగా కోలుకుంటావు, నీకు అన్ని విధాలా సేవలు చేస్తాను,'' అన్నది.

కూర్మయ్య ఇదంతా చూస్తూ కదలా మెదలక ఉండిపోయాడు. అప్పుడు బాలయ్య, ''అత్తయ్యా! విచారపడకు. సర్పగంధి తీగ నేను రోజూ తెచ్చి యిచ్చి, నా దారిన నేను పోతాను. నేను ఇంటికి వచ్చానని ఆవేశం తెచ్చుకోనని మాట ఇవ్వు,'' అన్నాడు.

శాంతమ్మ ఏదో చెప్పబోయింది. కానీ, కూర్మయ్య అడ్డుపడి, ''అయినవాళ్ళ అభిమానం ఆపదలోనే బయటపడుతుంది. రక్తసంబంధం అంటే అదే! నేను మేనమామను కాబట్టి నిన్ను మేనత్తగా భావించి, బాలయ్య సర్పగంధి రోజూ తెస్తానంటున్నాడు, గ్రహించావా?'' అన్నాడు.

శాంతమ్మ మారు మాట్లాడలేక వణుకుతున్న చేతులతో కళ్ళు తుడుచుకున్నది. ఆ తర్వాత, సునీత, బాలయ్యల సంరక్షణలో ఆమె త్వరలోనే కోలుకున్నది. ఆ విధంగా ఆరు నెలలైనా తిరక్కుండా ఆమే స్వయంగా పూనుకుని, సునీత, బాలయ్యల వివాహం జరిపించి, భర్త కూర్మయ్యతో సంప్రతించి బాలయ్యను ఇల్లరికపుటల్లుడుగా తెచ్చుకున్నది.





# నక్క ఎత్తు - పులి చిత్తు

ఒకసారి అడవిలో ఒక నక్క, ఒక తోడేలు తారసపడ్డాయి. రెండూ ఏవేవో ఉబుసుపోని కబుర్లలోకిదిగాయి.

కొంతసేపటికి తోడేలు అకస్మాత్తుగా నక్కను, "సరిసరి! నువ్వెంత వరకు చదువుకున్నావు?" అని అడిగింది.

"నిజం చెప్పాలంటే, నేను సగం చదువుకున్నదాన్ని మాత్రమే!" అన్నది నక్క గడుసుగా. "అయితే, నేను నీ కన్న రెండు రెట్లు విద్యావంతురాలిని. ఇక ఇప్పటి నుంచి నువ్వు నన్ను 'అయ్యా' అంటూ మర్యాదగా పిలవాలి, తెలిసిందా?" అన్నది తోడేలు.

సరిగ్గా అప్పుడే అతి భయంకరంగా గర్జిస్తూ పులి ఒకటి పొదల చాటు నుంచి బయటకు వచ్చింది.

అప్పుడు నక్క వినయంగా, తోడేలుతో, "అయ్యా! ఇప్పుడేం చేద్దాం?" అన్నది. కానీ, పులిని చూసి విపరీతంగా భయపడిపోయిన తోడేలు ఏమీ బదులు పలికే స్థితిలో లేదు.

పులి, వాటి మీదికి దూకడానికి తయారవుతూ తోకను గాలిలో అటూఇటూ తిప్పి, "ఏమిటేమిటి, తప్పించుకు పోవాలని చూస్తున్నారా?" అంటూ గాండ్రించింది.

వెంటనే నక్క, "అయ్యగారూ! మేము తమను దర్శించడానికే వస్తున్నాము. ఇంతలో, మా అదృష్టం కొద్దీ తమరే ఎదురయ్యారు. మాకు ఒక జటిలమైన మహాచిక్కు సమస్య వచ్చింది. ఆ సమస్యను మహా విద్యాధికులైన తమరు మాత్రమే పరిష్కరించ గలరని, మా నమ్మకం," అన్నది తెలివిగా.

పులికి, నక్క పొగడ్త చాలా సంతోషాన్ని కలిగించింది. అది తీరుబాటుగా వెనక కాళ్ళ మీదకు వంగి కూర్చుంటూ, "ఏమిటా చిక్కు సమస్య?" అని ప్రశ్నించింది.

దానికి, నక్క వినయంగా తలవంచి, "అయ్యగారూ! నేను ప్రాణానికి తెగించి

మేకల మదన్‌మోహన్‌రావు



అతి సాహసంతో, అడవి అంతా గాలించి, రెండు కుందేళ్ళను వేటాడి తెచ్చాను. కానీ, ఈ తోడేలేమో తాను నా కన్న విద్యాధికురాలు కాబట్టి, వాటిలో ఒకదాన్ని తనకివ్వమంటున్నది. కానీ, నాకిది ఏమాత్రం జంతున్యాయంగా కనిపించడంలేదు,'' అన్నది.

నక్క ఇలా అనగానే పులి, తోడేలుకేసి ఒకసారి ఎగాదిగా చూసి, ''ఔరా! ఇంతకూ నువ్వెంత వరకు చదువుకున్నావేమిటి?'' అని ప్రశ్నించింది.

దానితో తోడేలుకు భయంకొద్దీ పళ్ళు టకటకకొట్టుకోసాగాయి.

పులి, నక్కకేసి తలతిప్పి ఏమో అనబోయేంతలో నక్క, ''అయ్యగారూ! మరేంకాదు. తోడేలు తననోట్లో ఎన్ని పళ్ళున్నాయో అన్ని విద్యలు నేర్చిందట!'' అని భాష్యం పలికింది.

''అహ్హా, అదా సంగతి! అలా అయితే, మీ ఇద్దరి కన్న నేనే ఎక్కువ చదివాను,'' అంటూ పులి తన భయంకరమైన నోరు తెరిచి మెరిసే కత్తుల్లా వున్న తన పళ్ళను చూపించింది.

అది చూస్తూనే తోడేలు గజగజలాడుతూ మూర్ఛపోయింది. పులి ఆశ్చర్యపోతూ, ''ఇదేమిటి?'' అన్నది.

''అయ్యగారూ! మరేంలేదు. తోడేలు చదువులో తమ గొప్పతనాన్ని ఒప్పుకుని, మీ అతిపదునైన పళ్ళకు ప్రణామం చేస్తున్నది. మా సమస్యను మీరు పరోక్షంగా పరిష్కరించారు. దయచేసి తమరు మాతోపాటు మా

ఇంటికివస్తే, ఆ రెండు కుందేళ్ళనూ తమకు సమర్పించుకుంటాం,'' అన్నది నక్క.

పులికి పరమానందం కలిగింది. ఆ రెండు కుందేళ్ళను తిన్నాక హాయిగా నక్కనూ, తోడేలునూ తినడానికి తనను అడ్డేదెవరు అనుకున్నది.

''సరే! ముందుండి దారి తీయండి,'' అంటూ పులి లేచి నిలబడి, ఒకసారి ఒళ్ళు విరుచుకున్నది.

నక్క, పులిని గుట్టల మధ్యలో వున్న ఒక సొరంగమార్గం దగ్గరకు తీసుకుపోయి, ''అయ్యగారూ! మనం ఇక్కడే వుందాం. తోడేలు సొరంగ మార్గానపోయి, ఆ కుందేళ్ళను తెస్తుంది,'' అన్నది.

''అలాగే, వేగిరం, వేగిరం! ఆకలి నిలువునా కాల్చేస్తున్నది,'' అన్నది పులి ఆవులిస్తూ.

నక్క చూపిన సొరంగమార్గం చాలా ఇరుగ్గా వున్నది. కానీ, పులి బారిన పడకుండా తప్పించుకునేందుకు తోడేలు అందులోకి వెళ్ళక తప్పలేదు.

ఐతే, ఎంత సేపటికీ తోడేలు సొరంగం నుంచి బయటకు రాకపోవడంతో నక్క, పులితో, ''అయ్యగారూ! అనుమతించండి. నేను సొరంగంలోకి పోయి తోడేలు ఏంచేస్తున్నదో చూసి వస్తాను,'' అన్నది.

''అలాగే అనుమతించాను. మీరిద్దరూ కుందేళ్ళను తీసుకుని వేగిరం తిరిగిరండి,'' అంటూ పులి ఈసారి మరింత పెద్దగా ఆవులించి, చిన్నగా గాండ్రించింది.

నక్క లోపలికి దూరింది. ఐతే, కాలం గడుస్తున్నా ఎంతకూ నక్కా, తోడేలూ సొరంగ మార్గం నుంచి బయటికి రాకపోయే సరికి, పులి సొరంగంలో తల దూర్చి అక్కసు కొద్దీ వాటిని నానా తిట్లూ తిట్టి అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

కొంతసేపు చూసి, పులి వెళ్ళిపోయిందని గ్రహించిన నక్కా, తోడేలూ సొరంగం నుంచి బయటికి వచ్చినై.

అప్పుడు తోడేలు, నక్కను మెచ్చుకుంటూ, ''నీకు నాపాటి చదువు లేకపోయినా, గొప్ప తెలివితేటలున్నవి! నీ ఎత్తుగడతో, పులిని చిత్తుచేశావు,'' అన్నది.

''చిత్తం, అయ్యా! అంతా తమదయ,'' అన్నది నక్క కొంటెగా.





# కలిమి - లేమి

ఒక ఊళ్ళో ధనగుప్తుడనే వ్యాపారి ఉండే వాడు. అతడు తన జీవితమంతా విరామం అంటూ లేకుండా ధనార్జనలోనే గడిపి, లెక్కలేనంత డబ్బు సంపాదించాడు. బంధు మిత్రులలో సమర్థవంతుడైన వ్యాపారి అనీ, గొప్ప ధనవంతుడనీ పేరు తెచ్చుకున్నాడు. అతడు వృద్ధాప్యంలో పక్షవాతంతో మంచా నపడి, ''నా జీవితమంతా కేవలం డబ్బు సంపాదనలోనే గడిచిపోయింది. నా సంపాద నతో ఇతరులకు ఉపయోగపడే ఒక మంచి పనీ చెయ్యలేదు,'' అని పశ్చాత్తాపపడ్డాడు.

ఇలా అనుకుని, అతడు తన కొడుకైన శ్రీగుప్తుణ్ణి పిలిచి, ''నాయనా, నా జీవితంలో ప్రజోపయోగమైన పని ఒక్కటీ చెయ్య లేదు. నువ్వు నీ అవసరాలకు డబ్బు ఉంచుకుని, కొంత డబ్బుతో ఒక ధర్మశాల కట్టించు,'' అని చెప్పి కన్నుమూశాడు.

తండ్రి అంత్యక్రియలు పూర్తికాగానే శ్రీగుప్తుడు వ్యాపారంలో మునిగిపోయాడు. ఆ సంవత్సరం అతనికి బాగా లాభం వచ్చింది. అతనికి తండ్రి చనిపోతూ చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి.

''ఈ సంవత్సరమయితే ఎంతో కొంత లాభాలు వచ్చాయి. వచ్చే సంవత్సరం నష్టం రావచ్చు. ఖర్చు పెరగవచ్చు. ఎవరు చూశారు? పై సంవత్సరం ఇంకా లాభాలు వస్తే ధర్మశాల కట్టిస్తాను,'' అని అతను అనుకున్నాడు.

మరుసటి సంవత్సరం కూడా అమితంగా లాభాలు వచ్చాయి. అయినా అతనికి తృప్తి కలగలేదు. అతను ధర్మశాల నిర్మాణం మళ్ళీ వాయిదా వేశాడు. ఇలా కొన్నేళ్ళు గడిచిపోయాయి.

ఒకరోజు రాత్రి శ్రీగుప్తుడు చాలా పొద్దు పోయే వరకూ ఏవో లెక్కలు చూసుకుంటూ మేలుకుని ఉన్నాడు.

అప్పుడు ఎవరో బాధతో మూలుగుతూ, అతని ఇంటి ముందున్న అరుగు మీదికి

వచ్చి కూర్చున్నారు. శ్రీగుప్తుడు కిటికీలో నుంచి చూస్తే ఒక ముసలి, గుడ్డిబిచ్చగాడు అరుగుమీద కూర్చుని, తాను పెట్టిన సత్తు గిన్నెనూ, జోలెనూ తడుముకుంటూ దగ్గిరికి తీసుకోవటం కనిపించింది.

ఇంతలో అరుగు దగ్గరికి కుంటు కుంటూ మరొక బిచ్చగాడు వచ్చి, "చింపి రయ్యా, ఎందుకు అలా తెగ మూలుగు తున్నావు? నీకు ఏమయింది?" అని అడిగాడు.

చింపిరయ్య ఎంతో బాధతో, "నువ్వా, నారాయుడూ? ఏం చెప్పమంటావు? గుడ్డి వెధవని! ఉదయం అడుక్కుంటూ వస్తూంటే కాలిలో ఇంత మేకు దిగబడింది. మేకు తీశానుగానీ, కాలువాచింది. ఉన్న చోటి నుంచి అడుగు కదలలేకపోయాను. పట్టెడు మెతుకులు దొరకలేదు. ఒకపక్క కాలి బాధా, ఇంకోపక్క ఆకలి బాధా చంపే స్తున్నాయనుకో!" అన్నాడు.

నారాయుడు చింపిరయ్య కాలు వంక పరిశీలనగా చూశాడు. అది బాగా వాచిపోయి ఉన్నది. నారాయుడు, తన సంచీలో నుంచి గిన్నె తీస్తూ, "నీ కాలి బాధ తగ్గించటం నా వల్ల కాదుగానీ, ముందు ఈ అన్నం తిను, కాలి సంగతి తరవాత చూద్దాం," అంటూ తన గిన్నెను గుడ్డివాడికి ఇచ్చాడు.

"నువ్వుతిన్నావా? అడుక్కున్నదంతా నాకే పెడుతున్నావా?" అన్నాడు చింపిరయ్య సత్తు గిన్నెలోకి చేయిపెట్టి తడుముతూ.

"ఇద్దరికీ సమంగా పంచానులే. నా వంతు నీ గిన్నెలోకి తీసుకున్నాను," అన్నాడు నారాయుడు రెండు మెతుకులు తీసి ముసలివాడి గిన్నెలో వేసి తాను తీసుకుంటూ.

ఇదంతా కిటికీలో నుంచి చూస్తున్న శ్రీగుప్తుడికి కనువిప్పు కలిగింది. తనకున్న దానిలో కొంత పంచి ఇచ్చిన నారాయుడిది నిజమైన కలిమి, ఎవరికీ ఏమీ ఇవ్వలేని తనది లేమి!

ఆ రాత్రి శ్రీగుప్తుడు ఆ బిచ్చగాళ్ళిద్దరికీ ఆశ్రయమిచ్చి, మర్నాడు ఉదయం వైద్యుణ్ణి పిలిపించి చింపిరయ్య కాలుకు చికిత్స చేయించాడు. అంతేకాదు, ఆ రోజే తన తండ్రి కోరిన ధర్మశాల నిర్మాణం పని ప్రారంభించాడు.



రాజు ఆదేశం ప్రకారం, సొరంగమార్గం గుండా తప్పించుకున్న శాంతిపుర రాణి శాంతకుమారి, అరణ్య మధ్యంలో బిడ్డను జయానందమునికి అప్పగించి ప్రాణాలు విడిచింది. జయానంద ముని ఆమె భౌతిక కాయాన్ని కాపలా కాయమని రెండు పులులను నియోగించి బిడ్డతో ఆశ్రమం చేరుకున్నాడు. బిడ్డను భల్లూకి రక్షణలో వదిలిపెట్టాడు.

6

# ఆర్య

అజ్ఞాత యువరాజు
విచిత్ర సాహసగాథ

చిత్రాలు:
గాంధి అయ్య

మరునాడు మహారాణి భౌతిక కాయాన్ని భూస్థాపితం చేయడానికి గురువు ఆదేశం ప్రకారం శిష్యులు గోతి తవ్వడం ప్రారంభించారు.

రామూ, గోతిని మరింత లోతుగా తవ్వు.

గోవిందా, గోతి గోడలను రాళ్ళతోనూ, రాతి ముక్కలతోనూ పొదిగి దృఢంగా ఉండేలా చెయ్యి.

రా నాయనా, ఈ తెల్లపువ్వును మీ తల్లి కాయంపై వుంచి, పాదాలను తాకి నమస్కరించు!

మరి ఇద్దరు శిష్యులు తోడురాగా, నలుగురూ కలిసి, రాణిగారి భౌతిక కాయాన్ని జాగ్రత్తగా గోతిలోకి దించారు.

శవపేటిక మీది కొయ్యపలకలను మట్టితో కప్పండి. భౌతికకాయానికి ఎలాంటి హానీ జరగకూడదు. సురక్షితంగా ఉండాలి.


బాఘూ, బాఘీ ఇలా రండి. నేను చెప్పేంత వరకు, మీ ఇద్దరిలో ఒకరు ఎప్పుడూ ఇక్కడే ఉంటూ దీనిని రక్షిస్తూ ఉండాలి.


రండి, ఇక ఆశ్రమానికి వెళదాం. ఇకపై ఈ బిడ్డను సంరక్షించే బాధ్యత మనది.


అక్కడ రాజధానిలో యువరాజు జన్మదిన వేడుకలు అర్ధాంతరంగా ఆగిపోవడంతో ప్రజలు దిగ్భ్రాంతి చెందారు.
అందరూ వినండి! మన రాజ్యానికేదో దుర్గతి సంభవించింది. ఏ దుష్టశక్తి దీనికి కారణమో తెలియడంలేదు. మహారాజు, మహారాణి, యువరాజు జాడ తెలియడం లేదు.
సేనాధిపతి వీరసింహుడే ఆపద్ధర్మ పాలనా బాధ్యతలు స్వీకరిస్తాడు.


రాజుగారు ఎక్కడ? ఆ సంగతి మేం తెలుసుకోవాలి!


అవన్నీ మీకు అనవసరం! మీ మీ ఇళ్ళకు తిరిగి వెళ్ళండి.


ఆనందకరమైన రాత్రి ఇలాంటి విషాదకరమైన వార్తతో తెల్లవారిందే!
ఇక్కడ చర్చలువద్దు! చెప్పినట్టు చేయండి!


మునుముందు శాంతి లభిస్తుందంటారా?
మాట్లాడవద్దని అప్పుడే చెప్పాను.


భటులారా! వీణ్ణి అవతలికి లాక్కు వెళ్ళండి!


నన్ను పిలుచుకురమ్మని భటులను పంపావా?
అవును, ఆచార్యా! నాకు త్వరగా పట్టాభిషేకం జరగాలి!
అందుకు తగిన ముహూర్తం నిర్ణయించు.
అలాగా! అయితే, రాజుగారు లేరని రూఢిగా తెలిసిన తరవాతే
నీ పట్టాభిషేకం గురించి ఆలోచించాలి.
ఎవరక్కడ? వీణ్ణి కారాగారంలో బంధించండి!


మంత్రుల, రాజోద్యోగుల సమావేశం ఏర్పాటయింది.
మహామంత్రి మానవేంద్రా! నేను ఆపద్ధర్మ పాలకుడిగా ఎక్కువ రోజులు ఉండలేను. తమరు నాకు పట్టాభిషేకం చేయటానికి ఏర్పాటు చేయాలి.


సేనాధిపతీ! తమరు మరికొన్ని రోజులు వేచి ఉండడం మంచిదేమో...
నన్ను సేనాధిపతీ అని పిలుస్తావా? నీకెంత ధైర్యం! నేను అసలైన రాజునన్న సంగతి నీకు తెలియదా?


ప్రజలను ఏ కొరతా లేకుండా కన్నబిడ్డల్లా పాలిస్తూ, రాజ్యంలో శాంతి సామరస్యాలు నెలకొల్పేవాడే అసలైన రాజు. తమరు అలాంటి వారు కారని నా అనుమానం!
నేను తమ వద్ద పని చేయలేను!
చాలా బావుంది ఆహాహా!




మహామంత్రి మానవేంద్రుడు యథాప్రకారం ఆ రోజు సాయంకాలం శివాలయానికి వెళ్ళాడు.



ఆయన తిరిగి వస్తూండగా, హఠాత్తుగా ముగ్గురు వ్యక్తులు ఆయన మీదికి ఉరికారు.



మరుక్షణమే మెరుపులా వచ్చిన ఒక కత్తి ఆ ముగ్గురి తలలనూ తెగనరికింది. ముగ్గురూ అక్కడే పడి చచ్చారు.






(ఇంకావుంది)

# వినోద సమయం

## రంగులు వేయండి!

ఈ అసాధారణమైన మిత్రులు తెగ మురిసిపోతున్నారు. వారి వినోదంలో మీరూ పాలుపంచుకోవాలనుకుంటున్నారా? కలర్ పెన్సిల్స్ తీసుకుని రంగులు వేయండి మరి!



## ఏమిటో చెప్పండి!

భోలా సరైన వేట దొరకడంతో పరమానందంతో ఇంటికేసి వెళుతున్నాడు. కుడివైపున ఉన్న మూడు ముక్కలలో ఒకదానిని తీసి సంచీలో సరైన చోట అమర్చి, సంచీలో ఉన్నదేమిటో తెలుసుకోండి. జాగ్రత్తగా పరిశీలించి చూసి భోలా తెస్తూన్న వేటలో లేనిదేమిటో చెప్పండి చూద్దాం.












## తేడాలు కనుగొనండి

పైనున్న రెండు చిత్రాలనూ, జాగ్రత్తగా పరిశీలించి చూసి, రెండింటి మధ్య ఉన్న తేడాలను కనుగొనండి.

(సమాధానాలు 66వ పేజీలో)



## దారి చూపండి

లొట్టలు వేస్తున్న ఎలుగుబంటికి తేనెపాత్ర దగ్గరికి దారి చూపండి.




# ఫోటో వ్యాఖ్యల పోటీ



ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని,
చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా?
రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



MAHANTESH C. MORABAD



K.S. SIVARKKAMANI

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఫిబ్రవరి 2004 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.



## అభినందనలు

### అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

జి. చిరంజీవి
25, టాగూర్ వీధి
సెందిల్ నగర్,
చెన్నయ్ - 600 062.

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : కమ్మని చిరునవ్వులతో....
రెండవ ఫోటో : కలలు కనే కనులు!

### వినోద సమయం సమాధానాలు (పేజీ 64-65)

తేడాలు కనుగొనండి : 1. పక్షి తల మీద రోమాలు 2. పక్షి కాళ్ళు (ఒంటికాలు) 3. తేనెటీగ రెక్కలు 4. చిన్న ఈగ రెక్కలు 5. స్పూన్‌లో తేనె 6. బక్కెట్ మీది డిజైన్ 7. పువ్వులోని పుష్పదళం 8. ఈగ రొమ్ము మీది మచ్చ

ఏమిటో చెప్పండి : జింక. జింకకు తోక లేదు.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : B. Viswanatha Reddi (Viswam)


TRAPPED
CHANDAMAMA







